పల్లె జీవితాన్ని యథాతథంగా చిత్రించిన సాంఘిక చిత్రం

# నేడే చూడండి!

విజయ వారి

# షావుకారు

[ఇరుగు పొరుగుల కథ]

నటీనటులు:

డా॥ జి. వి. సుబ్బారావు, ఎన్. టి. రామారావు
శ్రీవత్సవ, వి. శివరామ్, ఎస్. వి. రంగారావు,
జోగారావు, రేలంగి, వంగర, ~~కె. వి. సుబ్బారావు~~
శాంతకుమారి, జానకి, కనకం, సీత, బేబీభాను



# చందమామ

ఈ సంచికలో యివి
చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు, చిక్కుచదరాలు, చిక్కుబొమ్మలు, ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.




సి. యస్. ఆర్. * బలిజేపల్లి ★ శ్రీరంజని ( జూనియర్ )

మొ॥ నటులుగూడ నటించిన అద్భుత చిత్రము

Sole Distributors :

**CHAMRIA TALKIE DISTRIBUTORS**

VIJAYAWADA : GUNTAKAL : SECUNDERABAD

# చందూ యొక్క సాహసకృత్యములు


















ది తాతా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

## 'చందమామ' కు ఏజంట్లు కావాలి

•

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయండి.

చందమామ ఆఫీసు,
పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు - 1.

## చందమామ చందాదారులకు మనవి

చందమామ ప్రతినెల, గతనెలాఖరులోనే చందాదారులకు పోస్టు చేయుబడును. కాపీ చేరనిఎడల మొదటి ఆరు తారీఖులలోగా తమ పోస్టాఫీసులో విచారించి, మాకు తెలియ జేయాలి. 10 వ తారీఖు తరువాత వచ్చు కంప్లైంట్లు ఆమోదింపబడవు. గడచిన మాసములలో చేరలేదనే కంప్లైంట్లు గమనింపబడవు.

మేనేజరు

# అట్టమీది బొమ్మ

దేవకీ, వసుదేవులు చెరలో ఉన్నట్టు క్రిందటిసారి తెలుసుకొన్నాము. కంసుని కసి అంతటితో తీరలేదు. శ్రీకృష్ణ, బలరాముల భరతం పట్టిగాని నిద్రపోకూడదని నిశ్చయించి, ఈ పని 'కేశి' అనే రాక్షసునికి వప్పగించాడు.

కేశి అపరిమితమైన బలశాలి, అతి చురుకైనవాడు, పరమ దుర్మార్గుడు, పైగా భీకరమైన గుర్రం స్వరూపం కలవాడు. కంసమహారాజు అజ్ఞాపించిన వెంటనే వాడు ఉత్సాహభరితుడై, నందాదులు నివసించే బృందావనానికి దౌడు తీసుకొంటూ వచ్చాడు. చంద్రనిప్పులవంటి ఎర్రటి గడ్లు మెరసిపోతూ, పొడవాటి జూలు అటు ఇటు ఊపుకొంటూ, టకటకమని అంగలు వేసుకొంటూ వచ్చే కేశి ధాటికి భూమి కంపించింది. ధూళిరేగింది. భయోత్పాతంతో అంతా ప్రాణాలు పిడికిట్లో పెట్టుకొనివున్నారు.

రాబోయే ఆపదను అవతారపురుషుడైన శ్రీ కృష్ణుడు గ్రహించి, నిమిషమైనా జాగుచేయక, ఒక్క ఊపున వెళ్ళి రాక్షసుని పైన తలపడ్డాడు. కేశి సామాన్యుడు కాదు. కృష్ణునిపైకి ఎగిరి తన్నబోయాడు.

అప్పుడు కృష్ణుడు, వాని వెనుకకాళ్ళు రెండూ పట్టుకుని గిరగిర తిప్పి
దూరానికి ... ...న కేశి మరింత పౌరుషంతో
... కృష్ణుని మోచేతిని కరిచిపట్టి,

...ష్ణుడు?— ఎడమచేతితో వాని
...తుముడివరకు పోనిచ్చాడు.
... అంతకంతకు పెద్దదై, రాక్షసుని
... లేక కేశి నెత్తురు కక్కుకొంటూ
...పోయాడు.



# చందమామ

పిల్లల కథల మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 6 | జూన్ 1950 | సంచిక 6



ఈ సంచికతో 'చందమామ'కు మూడేళ్ళు నిండినై. జూలై నించి నాలుగో ఏడు ప్రారంభమవుతుంది. ఈ మూడేళ్ళూ 'చందమామ' అంటె పాఠకులు చూపిన అభిమానం ఇక ముందుకూడా చూపుతూవుంటారని నమ్ముతున్నాం.

'చందమామ' ప్రారంభించిన ఆరు నెలలకే ఒక ప్రత్యేక సంచిక అందుకొన్న పాఠకులు తిరిగి మరొక ప్రత్యేక సంచిక వెయ్యమని పదే పదే ఉత్తరాలు రాస్తున్నారు. కాని వారి కోరిక మేము తీర్చలేనందుకు విచారిస్తున్నాం. ఇందుకు కారణం—

"సంక్రాంతి ప్రత్యేక సంచిక" మీకు మేము అందించిన ఆనాటి పరిస్థితులకీ, ఈనాటి పరిస్థితులకీ ఎంతో మార్పు వచ్చింది. ఆనాడు 'చందమామ' తెలుగు, తమిళ భాషల లోనే వెలువడుతూ వున్నది. కాని ఈ మూడేళ్ళలో మరిరెండు భాషలు—కన్నడం, హిందీ చేరినై. పైగా ఆనాడు తెలుగు, తమిళం కలిసి ముప్పైవేల ప్రతులు అచ్చు అవుతూవుంటే ఈనాడు ఒక్కతెలుగులోనే ముప్పైవేల ప్రతులకుపైగా అచ్చవుతున్నై. నాలుగు భాషలూ కలిపి ప్రతినెలా లక్ష ప్రతులకుపైగా అచ్చుకావాలి. నిజం చెప్పాలంటే నాలుగు భాషలలో యిన్ని ప్రతులు అచ్చువేసి అనుకున్న తేదీకి పత్రిక అందించటమే కష్టంగా వున్నది. అలాంటప్పుడు ప్రత్యేక సంచికలు మేము యివ్వలేకపోవటానికి గల కారణం పాఠకులు గ్రహించగలరని నమ్ముతున్నాం. ఒక్కవిషయం. ఏమాత్రం అవకాశమున్నా మేము పాఠకుల కోర్కెల్ని తీర్చటానికి ప్రయత్నిస్తామని నమ్మండి.





# గుణపాఠం

మహాజ్ఞాని సిఖ్ఖులగురువగు శ్రీ
గోవిందసింహు డొకనాడూ,
సంజవేళ గంగానది ఒడ్డున
పచారుచేస్తూ ఉన్నాడు.

ఇంతలోన ఎంతో ధనవంతుడు
శిష్యు డొకడు అటకొచ్చాడూ,
రవ్వలు పొదిగిన బంగరు మురుగులు
రెండు గురువుకై తెచ్చాడు.

తెచ్చి వందనము లాచరించి అవి
గురుచరణములం దుంచాడు.
ధనగర్వముగల అతనికి గురువొక
పాఠము నేర్పదలంచాడు.

ఒక కంకణమును చేతబట్టి ఆ
నటు నిటు త్రిప్పుతు చూశాడూ,
చూసి, చూసి 'ఇది ఏమం?'టూనే
విసిరి గంగలో వేశాడూ.

మెరసి మెరుపులా విరిసి తళుక్కని
కంకణమెట్లో ఒరిగిందీ,
'అయ్యయ్యో!' ఆ శిష్యుని చుట్టూ
భూమి గిర్రుమని తిరిగిందీ.

'పొరపాటున జారిందేమో'నని
మనసున అత డనుకొన్నాడూ,
రెప్పపాటులో నడుము బిగించుక
పోయి నీటిలో దూకాడూ.

రచన:
'బైరాగి'

కాని కంకణము బురదమట్టిలో
ఎక్కడ కూరుక పోయిందో ?
ఏటి వాలునే నీటి జాలునే
దూరము కొట్టుక పోయిందో ?

ఏమోమరి, అటు ఎంత వెదకినా
అది కనపడలే దాతనికి ;
రొప్పుతు, రోజుతు, నీరు కారుతో
బయటకు వచ్చా డాఖరికి.

అన్నాడాతడు— "ఓ గురువర్యా !
మించిపోయినది ఏముందీ ?
ఇప్పటికైనా చూపిస్తారా,
అది ఎక్కడ పడిపోయిందీ ?"

గురువు వెంటనే ఏట్లో రెండవ
మురుగుకూడ విసిరేశాడూ,
'మొదటి దిలాగే పోయిం' దంటూ
సైగ నీటికై చేశాడూ.

తెల్లబోయి నుంచున్నా డప్పుడు
శిష్యుడలా గురువును చూస్తో ;
లజ్జపొందినా డాతడు మదిలో
చేసిన నేరము నెమరేస్తో.

'ధనమూలమిద్మ జగత్తంత 'యని
మూఢులు మది ననుకొంటారూ,
'దానికంటె విశ్వాసమె మెండ'ని
జ్ఞానులు బోధిస్తుంటారు.





# రోకంటి పాటలు

[ సేకరణ: వడ్లమూడి గోపాలకృష్ణయ్య ]

వడ్లు పండించావు ఓదేవ, ఇపుడు
వడ్లల్లో వరిపుల్ల ఎందుకున్నాది?
మూరు దేశామెల్లి మగువల్తో గూడి
మళ్ళకే నీరెట్ట మఱచితిని దేవి!

* * *

కూడు పండినావు ఓకుసుమగన్నీ
కుండమీదా సార యెందుకున్నాది?
నల్లగొండల్నుంచి నాతమ్ము డొస్తే
మాటల సందటిని మఱచితిని రాజా!

* * *

అరటియాకులమీద వడ్లెండ బోసి
అరుగెక్కి నే జూతు నయ్యా బలగమ్ము!
తామరాకులమీద వడ్లెండ బోసి
తలుపెక్కి నే జూతు తల్లి బలగమ్ము!

* * *

నాన్నగారి చేను ఏమి పండింది?
రాజనము పండింది లక్ష్మి గోరింది.
తాతగారి చేను ఏమి పండింది?
తప్పలై పండింది తాలు కోరింది.
బావగారి చేను ఏమి పండిండి?
పల్లేరు పండింది పాడు కోరింది.

చక్కిడాలబుట్ట చంక నెట్టుకొని
సభలోన మాబావ సంగీత పరుడు
ఉల్లిపాయల బుట్ట నెత్తి నెట్టుకొని
ఊరిలో మాబావ ఉంగీత పరుడు.

* * *

మాబావ లొచ్చారు కూరేమి కూర?
పందిట్లొ సొరకాయ బల్లి తలకాయ!
మాయన్న లొచ్చారు కూరేమి కూర?
అడవి చిక్కుడుకాయ అలనంద వప్పు!

* * *

రాజనా లొడ్డైన భోజనాలైనా
రాజు పెనిమిటైన చింతేమి లేదు.
రాజ భోజనాలు గలిగున్ననాడు
రాజు మా అన్నను రమ్మన్న రాడు.

* * *

బందరు ఎల్లేవు బావ పెదబావ
బందరు కుంకుమాభరిణలూ తెమ్ము.
నువ్వెవరు నేనెవరు నేనెట్ట తెద్దు?
నీదేవి చెల్లెల్ని నీకు మరదల్ని
నీయత్త మామలకి ముద్దు కూతుర్ని
నీతల్లి దండ్రికి మేనగోడల్ని




దొరలు మనదేశం వచ్చిన కొత్తలో, వాళ్ళు ఊళ్ళో అడుగు పెట్టటానికి పల్లెటూరి ప్రజలు వప్పుకొనేవారుకాదు. ముఖ్యంగా అగ్రహారాల్లో బ్రాహ్మలు సుతరామూ వాళ్ళను రానిచ్చే వాళ్ళు కాదు. ఎందుకంటే, దొరలుఅనగా సీమదేశంనించి దిగిన మ్లేచ్ఛులనీ, వాళ్ళ సంపర్కం తగిలితే తమ ప్రదేశం మైలపడిపోతుందనీకాబోలు వాళ్ళ వుద్దేశం.

అటువంటి చాదస్తపు కాలంలో—దొరలు కలెక్టర్లుగా, జడ్జీలుగా పెద్దపెద్ద ఉద్యోగస్థులుగా బస్తీలకు వచ్చి చేరుకొనేవారు. ఉద్యోగరీత్యా చిన్నచిన్న గ్రామాలలో కూడా వారు మకాం చేయవలసి వచ్చేది. అవిధంగా మకాంచేసిన దొరలకు ఎదురు చెప్పడమంటే పల్లెటూరి వాళ్లకు భయంగా వుండేది. అలా భయపడకుండా ఉండే వాళ్లు గోదావరిజిల్లా కోనసీమలోని పేరూరు ద్రావిడులు. వారు దొరలను కాదుకదా, దొరలను పుట్టించిన బ్రహ్మనుకూడా లక్ష్యం చేయరన్నమాట. అంతటి ప్రతిభ, పలుకుబడీ గల ఆ పేరూరు ద్రావిడులు ఏ పేచీలు వచ్చినా వాళ్ళలో వాళ్ళే తగవులు పరిష్కారం చేసుకొనేవారు. అంతేగాని, కోర్టులకూ గిర్టులకూ తిరిగి పిరికిపందలనిపించుకునేవారు కాదు.

ఒకసారి పేరూరులో ఒక నేరం జరిగింది. అప్పటికే దొరలు కలక్టర్లుగా వచ్చి, పల్లెలలో మకాంచేసి, కేసులు విచారణచేయటం విరివిగా సాగుతూ వుంది. అన్ని పల్లెలకు వచ్చినట్టుగానే, కేసు విచారణకోసం పేరూరులో మకాం పెడదామని ఒక కలెక్టరు గుర్రం ఎక్కి నవుకర్లతోసహా బయల్దేరాడు.

కలెక్టరుగారు తమ ఊరి పొలిమేరకు వచ్చారనే వార్త పేరూరు ద్రావిళ్ళకు

ఈ నెల బహుమతి పొందిన 'సామెత కథ' — సంపాదన ; ధూళిపాళ శేషమ్మ, కాకినాడ



తెలిసింది. వెంటనే, వారిలో హేమాహేమీలు కొంతమంది ఊరివెలుపల కలెక్టరుగారి వద్దకు వెళ్ళి, "అయ్యా, దొరగారూ!— పరాయిదేశస్థులు అగ్రహారంలో ప్రవేశించటానికి వీలులేదని మా పెద్దలు ఏర్పాటు చేశారు. కనుక, మా గ్రామమర్యాద తమరు పాటించాలని కోరుతున్నాము" అంటూ, వినయపూర్వకంగా చెప్పారు.

దొరగారు అధికారగర్వంతో, వినీ విననట్లు నటించి నవ్వేసి ఊరుకొన్నారు. ఎన్ని విధాల చెప్పినా వాళ్ల మొర దొరగారి చెవికి ఎక్కేటట్టు కనిపించలేదు. మరి కొంచెం సేపటికల్లా కలక్టరుగారు ఊళ్లో దిగారు.

దేవాలయం పక్కనే వేయబడిన డేరాలో ప్రవేశించి, కేసు విచారణ ప్రారంభించారు.

రెండు మూడు రోజులు విచారణ జరిగింది. కలెక్టరుగారి గుర్రాన్ని బంట్రోతులు డేరా వెనుకపక్కని కట్టిపెడుతూ ఉండేవారు. మూడోరోజున, కలెక్టరుకు తగిన ప్రాయశ్చిత్తం చేయాలనుకొని, ద్రావిడులు నిశ్చయించారు. ఆ రాత్రి అందరూ గాఢనిద్రలో ఉండగా, వారు నడుములు బిగించి, ఒకొక్కరు ఒకొక్క గడ్డిమోపు చొప్పున అంచిలమీదతెచ్చి, గుడికి దాపుగా ఏటవాలుగా, చక్కా మెట్లుకట్టినట్టుగా గుడి మండపంమీది వరకూ పేర్చి, అమిర్చారు. తరవాత, గుర్రాన్ని కట్టిన చోటునుండి. గుడిపైదాకా వారు పేర్చిన ఆ మోపులమీద నవనవలాడే పచ్చగడ్డి ఒత్తుగా చల్లి, ఆ తర్వాత గుర్రానికి కట్టిన తాడు కాస్తా తొలగించివేశారు.

గుర్రం ఆ పరకలను అందుకొంటూ, ఒకొక్క అడుగే వేసుకొంటూ, ఆ మోపుల మీదినించి సులువుగా గుడిమీదికి ఎక్కిపోయింది.

తక్షణమే ఎవరు తెచ్చిన మోపు వారు తీసివేసి ఇళ్ళకు పట్టుకపోయారు.

తెల్లవారింది. దొరగారి గుర్రం పోయిందంటె పోయిందని ఊరంతా గల్లంతుగా వుంది. "ఏమిరా ఇంత అజాగర్త!" అంటూ దొర నవుకర్లను చెడా మడా తిట్టాడు.

నవుకర్లు కంగారుతో గ్రామమంతా చుట్టిచ్చారు. కాని, గుర్రం ఎక్కడా అగపడలేదు. ఇంతలో, పచారు చేస్తున్న దొరగారికి ఏమీ తోచక స్వయంగానే వెతకటానికి బయల్దేరారు. కొంచెందూరం పోయేసరికి, యజమాని కంటబడగానే గుడిమీద ఉన్న గుర్రం సకిలించింది.

దొరగారు దాన్ని చూచి ఆశ్చర్య పోయారు. గ్రామస్థులంతా క్షణంలో మూగేశారు. వాళ్ళంతా విస్తుపోయి చూస్తూ గోలచేస్తున్నారేగాని — గుర్రం గుడి ఎందుకు యెక్కింది? ఎలా ఎక్కింది? అనే ప్రశ్న ఒక్కళ్ళకూ తట్టనేలేదు.

అప్పుడు ఆ గుంపులోనించి ఒక ముసలి బ్రాహ్మడు ఒత్తిగించుకొంటూ దొరగారి వద్దకు వచ్చి, "బాబూ!— 'వద్దండి!' అని మొదట్లోనే మేం మొరపెట్టుకొంటే విన్నారుకాదు. పైగా, దేవాలయం దగ్గరే బస చేశారు. ఇటువంటి అప్రాచ్యపు పనులు



మా దేముడు సహిస్తాడనుకొన్నారా? మా దేముడికి ఇప్పుడు కోపం వచ్చింది. అందు కనే మీ గుర్రాన్ని గుడి ఎక్కించేశాడు. ఇప్పుడైతే పోయిందేమిటి? 'శరణు' అన్న వాళ్ళను క్షమిస్తాడు మాదేముడు. ఆయన కరుణిస్తే మీ గుర్రం మళ్ళీ మీకు దక్కు తుంది. కనుక, దేమునికి సాష్టాంగపడి మొక్కుకొండి!" అన్నాడు.

దొరగారికి ఈ మాట నచ్చింది. ఆ వృద్ధ బ్రాహ్మడు చెప్పినట్టుగా దేముణ్ణి ప్రార్థించారు. ఈవిధంగా దొరగారు చతుస్సాగర పర్యంతం చెప్పుకొన్నతరువాత, ఆయనతో ద్రావిడ బ్రాహ్మలు "మీరు నిశ్చింతగా ఉండండి. మీ గుర్రానికి వచ్చిన ఫరవా లేదు" అని అభయమిచ్చారు.

ఆ రాత్రికి రాత్రి, గడ్డిమోపులు మెట్లుగా పేర్చి, మునుపు ఏవిధంగా గుర్రాన్ని గుడి ఎక్కించారో అలానే చీమ చిటుక్కుమన కుండా మళ్ళీ దాన్ని భద్రంగా కిందికి దింపి, యథాస్థానంలో డేరావెనుక గుంజకు కట్టివేశారు.

మర్నాడు తెల్లవారేసరికల్లా తన గుర్రం సురక్షితంగా మకాంలో ఉండటంచూచి, కలెక్టరుగారు ఉప్పొంగిపోయారు. ఆనాటి నించీ పేరూరు ద్రావిడులంటే దొరగారికి గౌరవమూ, ఆ ఊరి దేముడంటే భక్తి విశ్వాసాలూ ఏర్పడినై. స్వామి ధూప దీప నైవేద్యాలకుగాను పది ఎకరాల భూమి పట్టాకూడా వ్రాసి ఇచ్చాడని ప్రజలు చెప్పుకొంటారు.

ఆనాటినించి ఆ ఊళ్ళో ఎవరైనా ఒక కూడనిపని తలపెట్టి ఎదటివాళ్లు 'ఆ పని చేయవద్దు' అన్నప్పటికీ మొరాయించి చేయబోతే, "గుఱ్ఱం గుడెక్కేను, జాగర్త" అంటూ ఉండేవారు.

ఈవిధంగా ఆ సామెత అలా ఆనాడు పేరూరులో పుట్టి, క్రమక్రమంగా దేశమంతటా వాడుకలోకి వచ్చిందట.





# వింత భక్తులు

పాండురంగ విఠలస్వామికి భక్తులంటె మహా ఇష్టం. 'భక్తులూ' అంటే మనుష్యులే కాదు. జంతువులు, పక్షులు, పురుగులు- వీటిలో ఏవి కాస్త భక్తి కనపరిచినాసరే ఆయన సంతోషించి,వాటిని అనుగ్రహిస్తాడు.

ఒకమాటు ఆయన తా నంతకుమున్ను గోపకుమారుడై పుట్టి ఉన్న రోజుల్లో అలవాటు అయిన పిల్లనగ్రోవిని ఊదు కుందామని బుద్ధిపుట్టి, మురళితెచ్చి హాయిగా వాయించటం మొదలెట్టేడు. ఆ గానం వినేటప్పటికి చుట్టుప్రక్కల ఉన్న ఆవులన్నీ ఆనందంలో మునిగిపోయాయి. అందులో ఒక ఆవు ఆ ఆనందంలో పరవశమైపోయి దానిపాలు చేపువచ్చాయి. ఎవరూ పితక్కుండానే అవి ధారలుకట్టి కురిశాయి. అంతలో ఒక పెద్దగాలి వేసి, ఆ పాల నురగలో రవంత తుంపరపోయి పాండురంగస్వామి శిరస్సుపైన పడింది.

ఆ ఆవు భక్తిపారవశ్యంవల్ల చేపువచ్చి పాలు కురిపించటం కనిపెడుతూనే ఉన్నాడు పాండురంగడు. పాలచుక్క తన శిరస్సుపై పడ్డంతోనే, అదే ఒక గొప్ప సేవగా తలిచి, ఆ దేవుడు ఆ ఆవును తనకున్న గొప్ప భక్తులందరిలోనూ ఒక దాన్నిగా చేర్చుకున్నాడు.

పాండురంగని ఆలయానికి ఎదురుగా ఉన్న ఒక రావిచెట్టుమీద ఒక కాకి ఉండేది. ఒకనాడు అర్చకుడు పాండురంగ స్వామికోసం అత్తెసరు అన్నంతెచ్చి నైవేద్యం పెట్టి వెళ్ళిపోయాడు. స్వామిముందు పడ్డ మెతుకులు తిందామన్న ఆశతో కాకి బాణానికిమల్లే వేగంగావచ్చి స్వామి ముందు వ్రాలింది. ఆ వేగంవల్ల పుట్టిన గాలిమూలాన స్వామిముందున్న దుమ్ము అంతా ఎగిరిపోయి తుడిచినట్లై, పాండు రంగనికి సంతోషం కలిగింది.

పాలంకి వెంటరామచంద్రమూర్తి, మదరాసు







'నా ముందున్న దుమ్మంతా చీపురు పుచ్చుకుని చిమ్మినట్లు పోగొట్టేవు కనక నిన్ను నా భక్తులలో ఒకణ్ణిగా చేర్చుకుంటా'నని కాకినికూడా తన భక్తులతో చేర్చుకున్నాడు.

ఇంతలో అక్కడికి ఒక హంస వచ్చింది. ఆ హంస ఎక్కడనుంచి వచ్చిందో కాని, వచ్చి స్వామిసమీపంలో ఉన్న సరస్సులో తృప్తితీరా యీతలాడింది. ఆ తర్వాత స్వామివద్దకు వచ్చి, ఱెక్కలు తపతపా కొట్టుకుంది. ఆ నీళ్ళన్నీ అక్కడ నేలమీద పడి నేల శుభ్రంగా పాచిచేసినట్లైపోయింది. 'కాకి తుడిచేసింది. నీవు నీళ్లుజల్లేవు కనుక నిన్నుకూడా కాకితోబాటే నా భక్తుల్లో చేర్చుకుంటా'నన్నాడు పాండురంగస్వామి.

'కాకి తుడిచింది. హంస నీళ్లు చల్లింది. ఇంక ఎవరైనావచ్చి ముగ్గుపెడితే బాగుండును' అని పాండురంగస్వామి అనుకుంటూంటే ఒక చిలుక ఎగిరివచ్చి స్వామిప్రక్కన వ్రేలాడే ఒక దండెంమీద వ్రాలింది. ఆ చిలుకను ఒక అమ్మాయి పెంచుకుంటూండేది. అనాడేం బుద్ధి పుట్టిందో గాని ఆ చిలుక ఆ అమ్మాయి గూట్లో దాచిపుంచుకున్న ఒక ముత్యాల హారాన్ని ముక్కున కరుచుకొచ్చింది. ఆ



హారాన్ని దండెంమీద కాళ్ళక్రింద నొక్కి పట్టి తన కరుకు ముక్కుతో పుటుకూ పుటుకూ నాలుగుపోట్లు పొడిచేటప్పటికి హారం తెగిపోయి ముత్యాలు స్వామి సన్నిధిని చిందరపందరగా పడ్డాయి.

"సెబాష్ చిలుకా! ఉత్తుత్తి ముగ్గుకాక నాయింట ముత్యాలతో ముగ్గులు పెట్టేవు. కనక కాకి హంసలకుమల్లేనే నిన్నుకూడా అనుగ్రహిస్తున్నాను" అన్నాడు విఠలుడు.

ఆ తరవాత అక్కడికి ఒక ఎలుకపిల్ల పరుగెత్తుకొచ్చింది. వెనకాలే దాన్ని పట్టుకుందామని ఒక పాము తరుము కొచ్చింది. స్వామిని చూచేటప్పటికి ఆ పాము ఎలుకమాట మరిచేపోయింది! పాండురంగడంటే ఆ పాముకు అంతభక్తి!

"స్వామిముందు ఎవరో తుడిచి నీళ్ళు జల్లి ముగ్గులుపెట్టేరు. కాని దీపంపెట్టేరు కారు" అనుకుంది.

పాము నెత్తిమీద మాణిక్య ముంటుం దని మీరు విన్నారుకదూ? ఆ పాము పడగ ఎత్తి స్వామి సన్నిధిని నిలపడేటప్పటికి, దీపంకన్నా ఎక్కువ కాంతితో ప్రకాసిస్తూన్న ఆ మాణిక్యంమూలాన్ని అక్కడ చీకట్లన్నీ పోయి వెలుగొచ్చింది.







"సెబాష్, సర్పరాజా, నువ్వుకూడా నా భక్తులలో చేరేవు" అన్నాడు స్వామి.

మరి కాసేపటికి ఆదారినే తేనెటీగలు కొన్ని గుంపులు గుంపులుగా చేరి పోతున్నాయి. వాటిల్లో ఒక్క ఈగమటుకు ఆగి స్వామి పాదసన్నిధిని ఉన్న ఒక పువ్వు మీదవ్రాలి అందులో స్వామియొక్క పాద తీర్థంతో కలిసివున్న మకరందాన్ని త్రాగింది. మహాభక్తులూ, మునులూ పాద తీర్థకోసం ఒకళ్ళ నొకళ్ళు తోసుకుంటూ ముందుకొస్తారు. అటువంటి పవిత్రమైన తీర్థాన్ని ఆ తేనెటీగ త్రాగిందిగనక స్వామి దానినికూడా తనభక్తుల్లో చేర్చుకున్నాడు.

ఈవిధంగా ఆవూ, కాకీ, హంసా, పామూ, చిలుకా, తేనెటీగా పాండురంగని భక్తులైనై. భక్తులై ఏమి లాభం పొందాయో వినండి.

ఆ ఆవు చాలాకాలం బ్రతికి, ముసలి పండై, ఆఖరికి ప్రాణాలు విడిచేసింది. తర్వాత జన్మలో మళ్ళీ ఆవై పుట్టకుండా పాండురంగని దయవల్ల ఒక విష్ణుభక్తుడికి కుమార్తెఅయి పుట్టింది. ఆ విష్ణుభక్తు డా అమ్మాయికి 'సుశీల' అని పేరు పెట్టాడు. ఆ అమ్మాయిపేరుకు తగ్గట్టు చాలామంచిది.

సుశీల పెరిగి పెద్దదయాక పెళ్లిచేశారు. ఆ అమ్మాయి ఎంత మంచిదో, దాని మొగుడు అంత చెడ్డవాడు, ఉత్త నీచుడు. డబ్బుకోసం ఎలాంటి కక్కూర్తి ఐనానకి పడేవాడు. తినటానికి సరిపోయేది ఉన్నా, ఎరగనివాళ్ళదగ్గర కెళ్ళి, "అయ్యా, బీద బ్రాహ్మణ్ణి. పిల్లకి పెళ్ళి చేసుకోటానికి డబ్బులేదు" అని యాచించేవాడు. పోనీ ఆ యాచించి తెచ్చిందైనా కడుపునిండా తినేవాడా? ఊహు, పాతర్లేసి, దాచు కున్నేవాడు. అంత లోభి! పైగా ఏదో వంకపెట్టుకుని సుశీలని కొడుతుండేవాడు. కాని సుశీలమాత్రం ఎవరితోటీ చెప్పుకునేది కాదు. మహా పతివ్రత గనక ఓర్చుకునేది.

వానిసంగతి తెలిసిన చుట్టం ఎవరూ వాళ్ళింటికి భోజనానికి దిగేవాళ్ళుకారు. ఒకవేళ తెలియనివా డెవడైనా వస్తే సుశీల మొగుడు "అయ్యా, మాకు మైలవచ్చింది." అని చెప్పి పంపేవాడు. కాని సుశీలకి మాత్రం ఇది కష్టంగా ఉండేది. ఏమంటే ఆవిడకు అతిథులంటే చాలా గౌరవమూ భక్తీని. అన్నం పెట్టమంటూ వచ్చిన అభ్యాగతులు కేవలం ఆ విష్ణుమూర్తితో సమానులని ఆమె నమ్మకం. కాని తనభర్త ఒప్పుకోనప్పు డేంచేస్తుంది?

తన దయవల్ల అవుకు మనిషి జన్మ వచ్చినా, భర్త దుర్మార్గు డవటంవల్ల సుఖపడలేకపోతున్న దన్న సంగతి పాండురంగస్వామికి తెలిసి సుశీలను కటాక్షించటంకోసం, ఒకనాడు ఒక వడుగు రూపంలో వచ్చాడు.

అప్పు డామెభర్త గ్రామంలో లేడు. సుశీలకు అతిథులంటే ఉన్న గౌరవాన్ని పరీక్షించటానికి యిదేసమయం అని ఆలోచించి, ఆ బ్రహ్మచారి, ఇంటిలోప ఉన్న సుశీలను పిలిచి, "అమ్మా, ఆకలి వేస్తోంది. పట్టెడన్నం ఉంటే పెట్టు" అని అడిగేడు.



ఆమె, "ఉండు నాయనా, ఒక్క నిమిషంలో వండి వడ్డిస్తాను" అంది.

"అబ్బెబ్బే, నువ్వు వండేదాకా నే నెక్కడాగగలను? చద్దికుండలో చద్ది అన్న మైనా సరే ఉంటే పెట్టు. 'పెట్టిపెట్టి చద్ది యన్నం పెట్టడ మేమిటి? పెడితే నాకు పాపం, తింటే నీకు పాపం' అంటావేమో! నువ్వేమీ సందేహించకు. నా ఆకలి తీరిస్తివా, మూడు లోకాలనూ తృప్తిపరచి నట్లే. ఇంక నాకువచ్చే పాపం మాటన్నావ్? జపం చేసి పోగొట్టుకుంటాను" అని ఆమెను తొందరపెట్టేడు. సుశీల ఏంచేస్తుందింక? పీటవేసి, ఆరిటాకు పరిచి చద్దికుండ తెచ్చి




వడ్డించుకోమని పెట్టి వెళ్ళింది. ఆమె మళ్ళీ వచ్చి చూచేటప్పటికి ఆ కపట బ్రాహ్మణ వడుగు కుండలోవున్నదంతా వడ్డించుకుని ఆకులో ఒక్క మెతుకైనా మిగల్చకుండా అన్నమంతా తినేశాడు. 'అమ్మా, ఇంకా ఆకలి తీరలేదు. ఆ కుండలో, అడుగునా పక్కల్నీ అంటిపెట్టుకుని ఏమైనా మెతుకు లున్నాయేమో చూడు.' అన్నాడు.

ఆమె వెతికి చూచింది గాని కుండలో ఒక్క మెతుకుకూడా మిగలలేదు! మూడు రోజుల్నుంచి ఏపూట కాపూట వండుకోడం, భర్త ఊళ్ళోలేదు గనక, పతివ్రతయైన సుశీలకు ఆ అన్నం నోటికి పోకపోవడం, అదంతా ఆ తరవాణి కుండలో వెయ్యటం జరిగింది. ఆ అన్నమంతా ఒక్కమాటుగా ఆ పొట్టివాడు తినేశాడూ అంటే ఆమెకు ఆశ్చర్యంవేసింది. ఇంకా చిత్రమేమిటంటే అదంతా తిన్నాకూడా అతని ఆకలి తీరలేదు!

నిలబడి ఆలోచిస్తే ఏం లాభమనిచెప్పి సుశీల తొలినాటి రాత్రి వండుకుని తినకుండా అలాగే ఉంచేసిన అత్తెసరు అన్నం తెచ్చి వడ్డించింది. తినేశాడు! పాయిమీద కాగుతోన్న చిక్కటి పాలుతెచ్చి 'త్రాగమం'ది. తాగేశాడు! కాని ఆకలి తీరలేదు. 'ఇంకా ఏమైనా ఉంటే తెచ్చి వడ్డించు' అన్నాడు.

అప్పుడు సుశీలకు జ్ఞాపకం వచ్చింది. భర్త కిష్టమైన మినపసున్ని, చక్కిలాలూ, చేగోడీలు మొదలైన పిండివంటలు కొన్ని మొగుడు ఊరు కెళ్ళక పూర్వమే చేసి ఇచ్చింది. ఆ లోభిమగడు ఆ వంటలు ఒక్కమాటుగా తినేస్తే ఐపోతాయేమో అన్న భయంకొద్దీ కొంచెమే తిని, సుశీలకేనా పెట్టకుండా మిగిలినవన్నీ కుండలలో దాచి అటకమీద పెట్టుకుని వెళ్ళేడు. అవి తెచ్చి పెడితే యీపిల్లవాని ఆకలి తీరుతుందేమో?

భర్తవచ్చి, ఆ మినపసున్ని అవీ లేక పోవటంచూస్తే మండిపడి తనని చావ కొడతాడని తెలుసుండికూడా సుశీల ఆ అతిథిని అర్ధాకలితో పంపటం ఇష్టంలేక పిండివంటల్ని క్రిందికిదింపి, ఆ పిల్లవానికి వడ్డించింది. వడ్డించటం తడువుగా విస్తరి ఖాళీచేసేశాడు ఆ దొంగ అతిథి! పోనీ అప్పుడైనా విస్తరివద్దనుంచి లేవచ్చా? ఊహు, 'ఇంకా ఏమైనా ఉంటే తే' అన్నాడు.




అప్పుడు సుశీలకంతా అర్థమైంది. 'ఈ వచ్చినవాడు పైకి పొట్టిగా చిన్న బిడ్డలా కనబడుతున్నాడే గాని, నిజంగా ఇతను పిల్లవాడై యుండడు. నన్ను కటాక్షించ టానికి వచ్చిన ఆ పాండురంగస్వామియే అయి వుండాలి. కాని, ఈ స్వామి ఆకలి నే నెలా తీర్చగలను?' అనుకుంది.

సుశీల ఇలా ఆలోచించుకుంటూంటే ఆమెకో ఉపాయం తట్టింది. 'స్త్రీలకు అగ్ని హోత్రుడు తండ్రిలాంటివాడు. ఇలాంటి సమయాల్లో ప్రార్థిస్తే ప్రత్యక్షమై సాయ పడతాడు' అని. ఆమె తక్షణమే అగ్నిదేవుణ్ణి ప్రార్థించింది. అగ్నిదేవుడు ఒక్క క్షణంలో ఆ ఇంటిని అన్నపురాసులతో, కూరలతో, పులుసులతో, పచ్చడులతో, పప్పులతో, వడియాలతో, అప్పడాలతో- ఒకటేమిటి అన్ని రకాల భోజన పదార్థాలతోటీ, పిండి వంటలతోటీ నింపేశాడు!

అప్పుడు పాండురంగస్వామి తన వామన రూపం వదిలేసి నిజరూపంలో సుశీలకు ప్రత్యక్షమయాడు. 'సుశీలా! నువ్వు మహా పతివ్రతవు. అందుకే అగ్నిదేవుడుకూడా నీకు సాయపడ్డాడు. నీ పాతివ్రత్యానికీ, అతిథి భక్తికీ మెచ్చుకున్నాను. వరం కోరుకో' అన్నాడు.

'స్వామీ నాకు మోక్షం ఇయ్యి' అని కోరుకుంది సుశీల.

అదివిని పాండురంగస్వామి, 'మోక్షమా? మోక్షం ఎలాగా ఇస్తాను. ఈలోగా ఈసంసార సౌఖ్యమంతా అనుభవించి, కొడుకులూ, మనుమలూ, మునిమనుమలూ ఎత్తేక మోక్షం సంపాదించుదువు గాని' అన్నాడు.

'స్వామీ, నా కింతవరకూ ఒక్క కుమారుడైనా కలగలేదు. మనుమలూ, మునిమనుమలూ అంటారేమిటి?' అంది సుశీల.

'ఒక్కడేకాదు, నీకు అయిదుగురు కుమారులు పుడతారు. ఆ ఐదుగురుకూడా పూర్వజన్మలో నాభక్తులే. అన్నట్లు చెప్పటం మరిచిపోయాను. నీ పూర్వజన్మలో నువ్వో ఆవువి. నాకు భక్తురాలివి కావటంవల్ల నీకీ జన్మవచ్చింది. నీలాగే ఒకకాకీ, హంసా, చిలకా, పామూ, తేనెటీగా నాకు భక్తులయాయి. ఆ ఐదుగురూ నీకు కొడుకులై పుడతారు' అనిచెప్పి అంతర్ధానమైపోయాడు.

పాండురంగడు పోతూ పోతూ సుశీలకి మరో ఉపకారంకూడా చేశాడు. ఆమెభర్త ఉత్త పిసినారీ, నీచుడూ, దుర్మార్గుడూ అనికదూ చెప్పేను. పాండురంగ విఠలుడు ఆ మహా పతివ్రతకు సంసారం సుఖంగా ఉండడంకోసమని, ఆమెమగని స్వభావమే మార్చివేశాడు.

ఊరునుంచి ఇంటికి తిరిగొచ్చేటప్పటికే ఆ లోభి అల్లా గొప్ప దాతగా మారిపోయాడు. అబద్ధాలు చెప్పటం యాచించటం మొదలైన పనులన్నీ మానేసి ఘరానా మనిషి అనిపించుకున్నాడు. ఇంట్లో పెత్తనమంతా సుశీలదే ఇప్పుడు. కొట్టడం, తిట్టడం మచ్చుకైనా లేదు. అప్పట్నించీ వాళ్ళ సంసారం ఎంతో సుఖంగా గడిచింది.

క్రమంగా ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు ఐదుగురు కొడుకులూ పుట్టేరు. ఆ కొడుకులకు కొడుకులూ, ఆ కొడుకులకు కూడా కొడుకులూ పుట్టేదాకా ముత్తయిదువై బ్రతికుండి, ఆఖరికి సుశీల భర్తతో పాండురంగ స్వామివద్ద మోక్షాన్ని పొందింది.






కాపులపాలెంలో గవరయ్య అనే ముసిలి కాపు ఒకడుండేవాడు. అతని భార్యపేరు గవరమ్మ. వాళ్లిద్దరికీ ఒకే ఒక్క కొడుకు. అతగాడికి అప్పన్న అని పేరుపెట్టేరు. అప్పన్న పెరిగి పెద్దవాడయాక అతడికి పేరమ్మ అనే పడుచును తెచ్చి పెళ్ళి చేశారు. పేరమ్మకి చాలా యేళ్ళవరకూ పిల్లలు పుట్టనే లేదు. అందరి దేవుళ్ళకూ మ్రొక్కుకున్నారు. ఏడుకొండల వెంకటేశ్వరుడికి కూడా మ్రొక్కుకున్నాక, ఒక కొడుకు పుట్టేడు. వాడికి వెంకన్న అని పేరెట్టుకున్నారు.

వెంకన్న పుట్టి[illegible]డి అప్పన్న మురిసి[illegible]డా ఒక కొడుకు తండ్రి అయాడు గనక తనకి అప్పట్నుంచీ ఏదో పెద్దరికం వచ్చినట్లనిపించింది. అంతకు ముందు తనకు గవరయ్య యేపని చెప్పినా, 'ఎందుకొచ్చిందిరా' అని యాథాలాభంగా చేసేవాడు ఇప్పుడు తండ్రి చెప్పకుండానే ఇంటిపనీ, పొలంపనీ కూడా తనంత తానే అరంభించి చేసేస్తున్నాడు.

గవరయ్య ఇల్లు పెంకుటిల్లు. పెంకు తిరగేసి చాలకాలం కావటాన ఇల్లు కురుస్తోంది. గవరయ్య కూలివాళ్లచేత అపని చేయిద్దామన్నాడు. కాని అప్పన్న 'ఇంటి నేతకు మనం ఇద్దరం చాలమా? కూలివాళ్ళెందుకు? డబ్బు దండుగ! ఆ డబ్బుతో మన చిట్టితండ్రికి రకరకాల బొమ్మలు కొనవచ్చు' అన్నాడు. గవరయ్య 'సరే'నని కూలివాళ్లని పెట్టటం మానేశాడు.

కూలివాళ్ళతో ఐతే పని ఏ ఎనిమిది గంటలకోగాని అరంభమవదు. అప్పన్న ఉదయం లేస్తూనే ఇల్లెక్కి కూచున్నాడు. పాతపెంకు ముక్కలన్నీ కిందకు తోసేసి, 'కొంత్తపెంకు అందియ్యండి' అన్నాడు.




గవరయ్యా, గవరమ్మా, పేరమ్మా కూడా సాయం చేశారు.

పది గంటలయే టప్పటికి కప్పుమీదకు పెంకు ఎక్కించటం ఐపోయింది. గవరయ్య కాపు ఆయాసం తీర్చుకోటానికి ఒకచోట కూర్చున్నాడు. గవరమ్మ గంజికాచటానికి వెళ్లింది. చిట్టివెంకన్న ఏడుస్తుంటే కప్పుమీద ఉన్న అప్పన్న 'పిల్లాడు ఏడుస్తున్నాడు తియ్యావే' అని కేకవేసి పేరమ్మని పంపేసి, తా నొక్కడూ పెంకు పేరుస్తున్నాడు.

పదకొండు ఘంటలైంది. 'చద్దికూడు తినకుండా ఇల్లెక్కేవు. కాసిన్ని మెతుకులు తిందుగాని, దిగు' అంది గవరమ్మ.

కాని అప్పన్న దిగలేదు. 'ఈ కాసింత మేరా నేసి దిగుతానులే' అన్నాడు.

పన్నెండు కొట్టింది. సూర్యుడు నడినెత్తి మీది కొచ్చాడు. అది మండువేసవికాలం.

గవరయ్య తిండి తినొచ్చి 'దిగిరారా నాయనా. చల్లబడ్డాక చూసుకుందాం' అన్నాడు. అప్పన్న. 'ఈ కాస్తమేరకి మళ్ళీ ఎక్కడమా? పూర్తిచేసి దిగుతా న'న్నాడు.

ఆ మిట్టమధ్యాన్నపు ఎండలో, లోపల కడుపూ, పైన నెత్తీ అలా మలమల మాడి పోతూవుంటే, తన కన్నకొడుకు అలా ఇంటిమీద కూచోడం గవరయ్యకి బాధ కలిగించింది. 'దిగరా బాబూ' అని అనేక విధాల బ్రతిమాలేడు; కోప్పడ్డాడుకూడాను. ఐతేనేం? అప్పన్నమాత్రం దిగలేదు.

తండ్రి పదేపదే చెప్పటంచూసి, 'కుట్టి కుంకకు చెప్పినట్లు చెపుతా వేమిటి? పోయి పడుకో' అని చిరాకుపడ్డాడు.

గవరయ్యకి మనసెలా ఒప్పుతుంది? కునుకెలా పడుతుంది? కన్నకొడుకు కష్టపడుతున్నాడు మరి. ఏమిచెయ్యటమా అని ఆలోచిస్తూ వుండగా ఎదురుగుండా మనుమడు మట్టిపెళ్లలు పెళ్లగిస్తూ కనపడ్డాడు. వాణ్ణి చూచేటప్పటికి గవరయ్యకు

ఏదో అలోచన తట్టింది. కూచున్నవాడు గుభాలున లేచి, పిల్లవాణ్ణి ఎత్తుకుని ఇంటి ముందుకు పరుగెత్తికెళ్ళేడు. ఇంటిమీద అప్పన్నకు కనపడేటట్లుగా ఎదురుగా ఎండలో ఆ పిల్లవాణ్ణి వదిలేశాడు.

అప్పన్న, 'అదేమిటి? పిల్లవాణ్ణి ఎండలో వదిలేశారు? లోపలకు తీసుకెళ్ళండి' అని ఇంటిమీదనుంచి అరిచాడు. గవరయ్య అక్కడవుంటేగా. ఇంట్లోకెళ్ళి కూచున్నాడు.

'ఏమిట్రా వినపట్టంలే? పసివాణ్ణి అట్టా నీడకి తీసుకెళ్లండి' అని మళ్లీ అరిచాడు అప్పన్న. చిట్టివెంకన్న ఎండకు తాళలేక ఏడవటం మొదలెట్టేడు కూడాను.

అప్పన్న కేకలకి గవరమ్మా, పేరమ్మా వీధిలో కొచ్చేటంతలో అప్పన్న నిచ్చెన నుంచి చరచరా నాగుబాములా కిందికి దిగొచ్చి పసివాణ్ణి తీసుకుని ఇంట్లోకి వస్తూనే, తల్లితో, 'అయ్యకి మతిగాని పోయిందేమిటి? పిల్లాణ్ణి అలా ఎండలో వదిలేసి యేడిపించాడేం?' అన్నాడు.

'ఎండలో ఉంటేనేం?' అన్నాడు గవరయ్య.

'ప్రాణం సొమ్మసిల్లిపోదూ?' అన్నాడు అప్పన్న మండిపడుతూ.



'నీకలా అనిపిస్తోందిరా నాయనా. నువ్వు ఇంటిమీద ఎండలో కూచున్నంతసేపూ నువ్వెక్కడ శోషొచ్చి పడిపోతావో అని నాకనిపించింది. ఐతేం? ఎంత బ్రతిమాలినా దిగేవా? నా బాధ నీకు తెలిసివచ్చిందా? నీ కొడుకు ఎండలో ఉన్నాడన్నప్పుడే నీకీ బాధ తెలిసొచ్చి దిగేవు. ఎవరు కన్నకడుపు బాధ వాళ్ళకిగాని తెలీదు' అన్నాడు గవరయ్య. ఆ మాటలు విన్న అప్పన్నకి, తనమీద తన తండ్రికున్న అపేక్ష అర్థమైంది. తనని ఇంటిమీదనించి 'దిగు, దిగు' అని అతను ఎందుకు పోరుపెట్టాడో అప్పటికిగాని తెలిసిరాలేదు.




పూర్వకాలమందు పాషాణుడు అనే బెస్త వాడు ఉండేవాడు. వాడు వేటయందు నిపుణుడు. ఐతే, వాడు ఎంతసేపూ తన క్షేమమే చూచుకొని, తన కీర్తికొసమే ఆపత్రయపడేవాడే కాని తన భార్యా బిడ్డల గతి ఏమిటా అని తలపోసేవాడే కాదు.

ఇలా ఉండగా ఒకనాడు, వానికి ఒక కల వచ్చింది. ఆ కలలో ఒక వాణి పలికింది: "ఓయి పాషాణుడా!- నీ భార్యనూ, ఐదుగురు బిడ్డలనూ ఎంతకాలం ఇలా హింసలు పెడతావు? రేపు ఉదయం తూర్పుదిశను వున్న 'చిలుక సరస్సుకు' పోయి నేను చెప్పేమంత్రం జపిస్తూ, ఒక రావిమండతో నీటపైన దీక్షగా కొట్టి ఏమి జరుగుతుందోచూడు" అంటూ ఆ వాణి ఒక మంత్రం ఉపదేశించి మాయమైంది.

దేవుడు ఉన్నాడనే మాటనే నమ్మని పాషాణుడు కలలు నమ్ముతాడా?- వాణి పలికిన పలుకులు పాటించక, అతను అటునుండి ఇటు తిరిగి పడుకొని, మళ్ళీ గుర్రుపెట్టి నిద్రించాడు. నమ్మకమున్నా లేకపోయినా కలమాత్రం వానిని వదల లేదు. వరుసగా రోజూ వస్తూనేవుంది. కలలో వాణి ఉపదేశిస్తూనూవుంది.

ఐనప్పటికీ, కఠినహృదయుడైన పాషాణుడు కలను కాదని పదిరోజులు తోసిపుచ్చాడు. పదకొండవ రోజున ఇక నిర్లక్ష్యం చేయలేకపోయాడు. ఈ చిత్రమైన కల యేమిటో, కలలో వాణి పలకత మేమిటో, ఆ మాటలు ఎంతవరకు సత్యమో చూదాం అని చిలుకసరస్సుకు వెళ్ళాడు.

ఉదయానే పాషాణుడు సరస్సు చేరుకొని, వాణి చెప్పిన మంత్రం పఠిస్తూ, రావిమండతో నీటిపైన అదేపనిగా కొట్ట నారంభించాడు. అలా దీక్షతో సాయంత్రం వరకూ కొట్టగా, ఒక సుడిగుండం ఏర్పడి,

డి. నరసింహయ్య, వరంగల్లు

అందులో సరోవరదేవత ఒక సర్పాకారంలో ప్రత్యక్షమై, ఏమి కావాలెనని అడిగింది.

"నాకు ఐశ్వర్యం కావాలి, నాతో సమమైన వేటకాడు మూడులోకాలలోనూ లేడు అనే కీర్తి కావాలి" అని కోరాడు, పాషాణుడు. అందుకు దేవత "సరే, నా తలపైన మెరిసే మణిని ఇస్తాను. అది నీ కోరికలు నెరవేరుస్తుంది. అయితే ప్రతి ఫలంగా నాకు నీ సంతానంలో ఒకళ్ళను వప్పగించాలిసుమా!" అన్నది.

"నీటిలో పామురూపంలో ఉండే ఈ దేవత పైకి రాగలదా, ఏమన్నానా? నా ఇంటికి వచ్చి నాసంతతిని తీసుకపోవటానికి దీని తరమా? అందుచేత, నోటిమాటేకద–'అలాగే ఇస్తాలే' అన్నంతమాత్రాన ఏమి పోయింది?" అని అనుకొని, సరోవరదేవత షరతుకి అంగీకరించాడు, పాషాణుడు.

ఎర్రని పూవులాగా ఉండి, మెరిసిపోతూ వున్న ఆ మణిని పాషాణుడు తీసికోబోయే సరికల్లా అది కిందపడి ఎర్రటి నుసి ఐపోయింది. ఇది అపశకునంగా భావించి, అతను విచారించాడు. కాని, దేవత వెంటనే అతన్ని సముదాయించి "నీ వేమీ కంగారు పడకు, నీకు అవసరమైంది ఈ భస్మమే.



దీనిని ధరించి ఏపనికి వెళ్ళినా ఆ పని దిగ్విజయమవుతుంది. గుక్కెడు నీళ్ళల్లో కలిపి తాగితే ఏ వ్యాధి అయినా నయమవుతుంది. ఇక వెళ్లు" అన్నది.

అప్పుడు పాషాణుడు "దేవీ!— ఈ భస్మం చూడబోతే ఎంతో లేదు. ఇది ఐపోయింతరువాత ఏం చేయమంటావు?" అని అడిగేసరికి, "దానికేముంది? మళ్లీవస్తె మరికొంచెం మంత్రభస్మం ఇస్తాను. ఐతే, నీవువచ్చి నావద్ద ఈ ఉపకారం పొందినప్పుడల్లా నీ సంతతిలో ఒకరిని నాకు వప్పగించాల్సి వుంటుంది సుమా!" అని చెప్పి ఆమె అదృశ్యమైంది.



వరంపొందిన పాషాణుడు ఉత్సాహంతో వేటకు వెళ్ళగా, ఎన్నడూలేనిది ఆరోజున అపరిమితంగా జంతువులు దొరికినై. వాటిని తీసుకొని అతను ఇంటికి చేరుకొనేసరికి, 'కడసారివాడు కనపడలేదు. ఏమైనాడో' అంటూ భార్య గోలపెడుతున్నది. కారణం వానికి తెలుసుగా? అప్పుడు భార్యతో సంగతి సందర్భాలన్నీ చెప్పి, "బ్రతికి బాగా వుంటే మళ్లీ పుడతారు పిల్లలు. కనుక, విచారించకు," అంటూ ఓదార్చాడు.

ఇలా కొన్నాళ్లు బాగానే గడిచినతరువాత పాషాణుడి చేతిలో ఉండే మంత్రభస్మం అయిపోవటంవల్ల అతను మళ్ళీ చిలుక సరస్సుకు పోయి, దేవతను ఆరాధించాడు. మునపటిలాగానే దేవత ప్రత్యక్షమై, మళ్ళీ ఒక మణి ఇచ్చింది. ఆ మణియొక్క భస్మం తీసుకొని తలచిన పనులు దిగ్విజయంగా నెరవేర్చుకుంటూ, ఇంటికి చేరుకొనేసరికి ఇంకొక కొడుకు కనపడటం లేదంటూ ఇల్లాలు గోలచేయజొచ్చింది. ఎలాఐతేనేం, ఈసారికూడా పాషాణుడు భార్యను మెల్లిగా సముదాయించి, ఊరుకోబెట్టాడు.

ఈవిధంగా అతను వరసన తన ఐదుగురు బిడ్డలనూ, సరోవరదేవతకు అర్పించి, ధనమూ కీర్తీ ఆర్జించుకున్నాడు. బిడ్డలందర్నీ అర్పించిన తరువాత చివరకు భార్యను కూడా సమర్పించివేశాడు. ఇక యిప్పుడు, బదులుగా మనిషినిచ్చి భస్మం తెచ్చుకుందామంటే ఎవళ్లూ లేకపోయారు.

అందుచేత, మంత్రభస్మం చేతిలో లేక, పాషాణుడికి ఏపనిలోనూ జయం కలగటం లేదు. దశ మళ్లిపోగానే కులంవాళ్ళందరూ "మేటి వేటకాడట! తోడా వేసుకున్నాడట!!" అంటూ పరిహాసం చేస్తూవచ్చారు. ఇలా పాషాణుడి బ్రతుకు హేయమైపోయే సరికల్లా, ఏమీ పాలుపోక అతను విచారంగా అడుగులు వేసుకుంటూ పోతూవున్నాడు.



దారిలో వాని కొక చిన్న మడుగు, దాని నిండా బోలెడన్ని ఎన్నికయిన చేపలూ కనబడినై. "ఏమి అదృష్టమోగాని ఇన్నాళ్లకు మళ్ళీ మంచి వేటదొరికింది!!" అని సంతోషించి, వాటిని పట్టబోయాడు. చేతికి దొరికిన చేపలన్నీ తప్పించుకుపోయినైగాని, ఒక చిన్నచేప మాత్రం చిక్కుకొన్నది.

పాపాణుడు దానిని పట్టి చంపబోగా, అది మానవ భాషలో "నాన్నా! నాన్నా!! చంపబోకు" అనగానే అతనికి అమితాశ్చర్యం వేసింది. తరువాత క్రమంగా—సరోవరదేవత మహిమవల్ల తన భార్యా బిడ్డలూ చేపరూపం పొంది ఈ మడుగులో మగ్గిపోతూవున్న సంగతి తెలిసి, తన బుద్ధి తక్కువవల్లనేకద తనవాళ్లు ఇలా కష్టాలు పడవలసి వచ్చిందని పశ్చాత్తాపపడ్డాడు.

తక్షణమే చిలుకసరస్సుకి చేరుకొని, దేవతను ప్రార్థించగా, ఆమె ప్రత్యక్షమైంది. అప్పుడు పాపాణుడు "దేవీ! భార్యా బిడ్డలు లేని ఈ బ్రతుకెందుకు? ఏకాకినై జీవించినా ఒకటే, లేకున్నా ఒకటే. ఇదంతా నా బుద్ధి తక్కువవల్లనే వచ్చిందని ఇప్పుడు గుర్తించగలిగాను. కనుక, కరుణించి నా కుటుంబానికి తిరుగా మామూలు రూపం అనుగ్రహించవలసింది" అంటూ ప్రాధేయపడ్డాడు.

అందుకు దేవత "ఓయి పాపాణుడా! ఈబుద్ధి నీకు ఇంతకుముందే ఉండిఉండవలిసింది. ఐశ్వర్యవంతుడవై ఉన్నప్పుడైతే నీకోరిక సులువుగా నెరవేరేది. ప్రతిగా ఏదైనా ఇస్తేకాని నీకు ఎట్టి ఉపకారం చేయటానికి వీలుకాదు. నీ చేతిలో కాసైనా లేవే, నేనేం చేసేది?" అన్నది.

అప్పుడు పాపాణుడు "నీవు కటాక్షించదలిస్తే ఇదొక పెద్ద ఉపకారం కాదు. ఎలాగైనా నా కోరిక నెరవేర్చవలసిది" అంటూ కాళ్ళా వేళ్ళా పడి ప్రార్థించాడు.



సరోవరదేవతకు దయకలిగి, "సరే, ఒక్కటే ఉపాయమున్నది. అటు భూమి మీదా, ఇటు నీటిలోనూకూడా మసలగలిగే పాము జన్మ ఇస్తాను, నీకు. నువు రాళ్లలో నించి రత్నాలూ, సముద్రం అడుగునించి ముత్యాలూ పోగుచేసుకువచ్చి నాకు ఇస్తూ వుండాలి. ఇలా నమ్మకంగా మూడునెలల పాటు నన్ను సేవించాలి. గడువు పూర్తి కాగానే నిన్ను విడుదలచేసి, నీ కుటుంబాన్ని నీకువప్పజెపుతాను" అని హితవు చెప్పింది.

ఎంత కఠినహృదయుడైతేమాత్రం ఏం చేయుగలడు? భార్యా బిడ్డల మీద మమకారంచేత దేవతచెప్పిన దానికి చచ్చినట్టూ వప్పుకొన్నాడు.

వెంటనే దేవత పాషాణుడిని పాముగా మార్చివేసింది. ఇన్ని కష్టాలలోనూ ఒక్క సుగుణమేమిటంటే, పామురూపంలో వున్న పాషాణుడు మడుగులో ప్రవేశించి తన భార్యా బిడ్డలను చూచుకొంటూ ఉండే వాడు. ఈ తృప్తితోనే అతను ఆ మూడు నెలలూ సంతోషంగా గడపగలిగాడు.

సరోవరదేవత పెట్టిన గడువులో పల పాషాణుడు శ్రమపడి రాళ్ళలో నించి రత్నాలూ, సముద్రం అడుగునించి ముత్యాలూ కొల్లలుగా పోగుచేసుకువచ్చి చిలుక సరస్సును నింపివేశాడు. అందుకు సంతోషించి, దేవత అతనితో "వోయి పాషాణుడా!- నీ వెంతో విశ్వాసంగా చేసిన సేవకు చాలా ఆనందమైంది. ఈరోజుతో గడువు తీరిందికనుక ఇంక నీవు ఇంటికి పోవచ్చు" అనేసరికి పాషాణుడికి మళ్ళీ మామూలు రూపం వచ్చేసింది.

ఇంతలోనే అతని భార్యా పిల్లలుకూడా మళ్లీ మామూలురూపంతో అక్కడికి వచ్చి చేరుకున్నారు. వారంతా కలిసి దేవికి నమస్కరించి ఆమె దీవనపొంది యింటికి తిరిగివచ్చి, నాటినుండి అంతా హాయిగా వుంటున్నారు.



# దురదృష్టవంతుని బాగుచేసేవారు లేరు



పూర్వం ఒకపల్లెలో 'దామోదరయ్య' అనే పేదబ్రాహ్మణుడు ఉండేవాడు. అతను ఉత్త గర్భదరిద్రుడవటంవల్ల అష్టకష్టాలూ పడేవాడు. కొందరు పేదవాళ్ళుగా పుట్టినా, క్రమంగా ధనం, పొలం సంపాదించి, భాగ్యవంతులౌతారు. దామోదరయ్య దౌర్భాగ్యం ఎలాంటిదో కాని అతడెంత శ్రమపడినప్పటికీ తక్కినవాళ్ళకుమల్లే భాగ్యవంతుడు కాలేకపోయాడు. పొట్టపోసుకోటానికి యాయవారంచేసి తెచ్చుకోవలసివచ్చేది. యాయవారం చేసుకునే వాళ్ళుకూడా కొందఱు, ఆ బియ్యం అమ్మిన సొమ్ముతో సంసారం గడుపుకోటమే గాకుండా, భార్యలకు నగా నట్రా చేయించడమో, వడ్డీవ్యాపారం చెయ్యటమో ఉంది. కాని, దామోదరయ్యకి అవేమీ కుదరలేదు సరికదా, ముష్టికి వెడితే భోజనానికి సరిపడేటన్ని బియ్యమైనా దొరకటం కష్టమయేది.

అతడు తన పల్లెలో ముష్టియెత్తటానికి తగినన్ని యిళ్ళు లేవనితోచి, సమీపంలో ఉన్న ఒక పట్టణానికి రోజూ యాయవారం వెళ్ళి వస్తుండేవాడు. పట్టణంలో నాలుగు వీధులూ తిరిగి రావటానికి అవకాశం ఉంది గనక అక్కడ ముష్టిబియ్యం బాగానే పోగుపడేవి. కాని బియ్యంతోపాటు అతని సంసారంకూడా తామరతంపరగా పెరుగుతూ వచ్చింది. 'మంది ఎక్కువైతే మఠానికి చేటు' అన్నట్టుగా, సంతానం పెరిగినకొద్దీ తెచ్చిన బియ్యం చాలకుండా పోయినై. అందుచేత అందరి పిల్లలూ సిరితో తులతూగుతూంటే అతని పిల్లలు తిండికి చాలక ఈసురోమంటూ ఉండేవాళ్ళు.

దామోదరయ్య తన దరిద్రంతోనూ, కులసంతానంతోనూ ఇలా బాధపడుతూ ఉండగా, వీటికి తోడు దేశంలో కరువు కూడా వచ్చింది. కరువుమూలాన్ని బియ్యం

ఆర్. వెంకటరెడ్డి, అనంతపురం



దొరకటం అంతకంతకు మరీ కష్టమయి పోయింది.

ఒకనాడు అతనికి దొరికిన బియ్యం ఉన్నాయా లేవా అన్నట్టనిపించింది. ఆ తేలిక మూటతో పట్టణాన్నుంచి తన పల్లెకు సరిగా రెండుఝాములవేళ తిరిగిపోతూ, 'ఇంక బతికేదెలా ఈశ్వరా?' అని ఒక్క నిట్టూర్పు విడిచాడు.

అదె సమయానికి ఆకాశమార్గాన పార్వతీ పరమేశ్వరులు నందివాహనం ఎక్కి పోతున్నారు. ఏదో ఆలోచించు కుంటూ పరధ్యానంగా ఉండటంవల్ల పరమేశ్వరుడికి దామోదరయ్య నిట్టూర్పు వినపడలేదు కాని పార్వతీదేవికి వినపడింది. 'ఎవరో మిమ్మల్ని తలుచుకుంటున్నారు, వినిపించలేదా?' అన్నది ఆవిడ.

చేను గట్టమ్మటే పల్లెవైపు నడిచిపోతూ వున్న దామోదరయ్యను పరమేశ్వరుడు పరకాయించిచూచి, "ఈ దౌర్భాగ్య దామోదరుడా? ఎవడో అనుకున్నాను!" అని నందినిజోరుగా తోలటం మొదలెట్టేడు.

పార్వతీదేవి ఆశ్చర్యపోయి, 'అదేమిటండీ, ఇంత చికాకుగా ఉన్నారీవేళ? అతడు దౌర్భాగ్యుడని మీరే అంటున్నారాయిరి! కాస్త భాగ్యం ప్రసాదించి, ఇబ్బంది లేకుండా చెయ్యకూడదా?' అన్నది మళ్లీ.

'పార్వతీ! అదృష్టవంతుణ్ణి చెరిపేవాడూ, దురదృష్టవంతుణ్ణి బాగుచేసేవాడూ లేడని చెప్పటం వినలేదూ నువ్వు?' అని అడిగాడు పరమేశ్వరుడు.

'విన్నాను కాని, నందిని పందిగానూ, పందిని నందిగానూ చేయగల సర్వ సమర్థులు మీరు; మీకు శక్యంగాని దేముంది ప్రభూ?' అన్నది పార్వతి.

జాలిగుండె కలది కనుక పార్వతీదేవి పరమేశ్వరుణ్ణి అలా తొందరచేసిందే కాని,

నిర్భాగ్యుల్ని బాగుచెయ్యటం ఆ దేవునికీ అసాధ్యమన్న సంగతి ఆమె గమనించింది కాదు. ఆమెకోరిక తీర్చకపోతే చిన్నబుచ్చు కుంటుందని, ఈశ్వరుడు 'సరే; రేపు దామోదరయ్య మళ్ళీ యాయవారానికి పట్టణం వెళ్ళే సమయానికి యీ దారిలో ఒక వరహాలమూట తెచ్చి పడేద్దాం, ఏం జరుగుతుందో నీవే చూద్దుగాని' అన్నాడు.

మర్నాడు ప్రొద్దు పొడవకముందే వచ్చి, పరమేశ్వరుడు పార్వతీదేవి చూస్తూండ గానే వరహాల మూట ఒకటి దారి పక్కన పడేశాడు. దామోదరయ్య రోజూమల్లెనే మామూలుగా చెంబు తెల్లగా తోముకుని బయల్దేరేడు. పల్లెలో వీధికొసని బడి పంతులు ఇల్లుంది. ఆ అరుగుమీద కూచుని పంతులు కొడుకు పాఠం చదువుకుం టున్నాడు. "గోదావరీ పుష్కరము పన్నెండు సంవత్సరముల కొకమారు వచ్చుచుండును" అని ఆ పిల్లవాడు చదువుతూంటే అది దామోదరయ్య చెవిని పడింది.

"పుష్కరం" అనటంతోనే దామోద రయ్యకి పాతసంగతి ఒకటి జ్ఞాపకానికి వచ్చింది. "నేను ముష్టికోసం పట్నం వెళ్ళటం మొదలెట్టి పుష్కరమైంది. అప్పుడే మళ్ళీనెలలో ఇంకో పుష్కరం వచ్చేస్తోంది. పన్నెండేళ్ళూ ఎంత తొరగా గడిచిపోయాయోకద!" అనుకున్నాడు.

ఇలా అనుకుంటూ అతడు పల్లె వదలి దారిలో అడుగుపెట్టేడు. ఆ బాటను చూడడంతోనే, అతనికి ఒక దౌర్భాగ్యపు ఆలోచన తట్టింది. "ఇన్ని సంవత్సరాలుగా నేను రోజూ తిరుగుతూవున్న బాట గనక, ఇంక ఈ బాటన నేను కళ్ళుమూసుకు వెళ్ళినా, తప్పిపోకుండా పట్టణం చేరుకో గలను' అనుకొని రెండు కళ్లూ మూసు కొని నడవజొచ్చాడు.



"కళ్ళు మూసుకున్నా కూడా మనస్సులో స్పష్టంగా దారి కనపడుతోనే ఉందే! కళ్లు తెరిచినప్పటికన్న మూసుకున్నప్పుడే చాల బాగా కనపడుతోంది!" అనే సంతోషంతో అతడు కళ్లు మూసుకునే చరచరా నడిచాడు. మలుపులూ, గోతులూ, దిబ్బలూ అన్నీ జ్ఞప్తికి తెచ్చుకుంటూ, తడుముకోకుండా, అతడు సరాసరి నడిచి వెళ్ళిపోయాడు. దారి తప్పకుండా పట్నం మొగిదాకా కళ్లుమూసుకుని నడవగలిగేనని చంకలు ఎగురవేసుకోవటమే కాని, దారి పక్కన వరహాలమూట ఉన్న సంగతి అతడు ఎంతమాత్రమూ తెలుసుకోనేలేక పోయాడు!

ఇదంతా ఆకాశం మీదినించి చూస్తూన్న పార్వతీదేవి, "దారిలో ధనలక్ష్మి కాచుకొనివుంటే, కళ్లు మూసుకు నడవాలన్న బుద్ధి పుట్టిందేమిటి ఈ దౌర్భాగ్యుడికి?" అని విస్తుపోయింది

అప్పుడు పరమేశ్వరుడు నవ్వుతో, "నేను చెప్పలేదా? దురదృష్టవంతుణ్ణి ఎవరూ బాగుచెయ్యలేరని?" అన్నాడు.

అంతలో ఆదా నే గ్రుడ్డివా డొకడు కర్రతో దారి తడుముకుంటూ వచ్చి, అక్కడ పల్లంఉన్న సంగతి తెలియక అడుగువేసి ఆ మూటమీద బోర్లపడ్డాడు.

మూటవిప్పి చేతులతో తడిమి చూచుకునేటప్పటికి, కళ్ళు లేని కబోదిఐనా అవి వరహాలని తెలుసుకొని, మూట చంకన పెట్టుకొని చక్కా పోయాడు.

అదంతా చూస్తున్న పార్వతీదేవి, ఈ చిత్రం గమనించి ఆశ్చర్యపోయింది.

పరమేశ్వరుడు, "ఆశ్చర్యానికేముంది అతను దరదృష్టవంతుడు కనుకనే కళ్లుండి కూడా ధనలక్ష్మిని కానలేకపోయాడు. వీడు పుట్టంధుడైనా అదృష్టవంతుడు గనక చూడగలిగేడు" అంటూ ఆమెను వెంటబెట్టుకుని కైలాసం చేరుకున్నాడు.





# 'చెఱపకురా చెడేవు'

ఒకానొక రాజ్యంలో పేద దంపతులు ఉండేవారు. వారికి లేకలేక ఒక కుమారుడు పుట్టాడు. ఆ కుఱ్ఱవానికి పద్దెనిమిదో ఏట రాజకుమారితో పెళ్ళి అవుతుందని వాని జాతకంలో ఉన్నట్టు ఒక పుకారు పుట్టింది.

ఈ పుకారు ఆనోట ఆనోటా అల్లుకొని, మెల్లగా రాజుగారి చెవినికూడాపడింది. ఈవార్తవిన్న వెంటనే రాజు తన మంత్రిని ఆ పేద దంపతులవద్దకు పంపి ఎలాఐనా ఆ కుఱ్ఱవాడిని తీసుకరమ్మన్నాడు.

మంత్రి వెళ్ళి, ఆ దంపతులకు వేయి వరహా లిచ్చి, పిల్లవాడిని తీసుకవచ్చాడు. పిల్లవాడిని వెంటనే ఒక పెట్టెలో పెట్టి, నదిలో వదిలిపెట్టించివేశాడు రాజు. 'ఇక పీడ వదిలింది. నా కొమార్తెకు పేదవాణ్ణి పెళ్లిచేయవలసిన యోగం తప్పింది' అని తృప్తిపడ్డాడు. నీటిపైన వదిలిన కుఱ్ఱవాడు మళ్లీ బతికే దేమిటి? అని రాజు వుద్దేశం.

అయితే - పిల్లవాడున్న ఆ పెట్టె పోయి పోయి ఆనకట్ట వద్ద తేలి, రాజుగారి నవుకరులలో ఒకనికి దొరికింది. పిల్లా పాపా లేని ఆ నవుకరు ఈ పిల్లవానిని అల్లారుముద్దుగా పెంచుకుంటున్నాడు.

ఇలా ఇంచుమించు పద్దెనిమిదేళ్ళు గడిచిపోయినై. ఒకరోజున రాజు, ఏదో పనిమీద ఆనకట్టవద్దకు వచ్చి నవుకరును పలకరిస్తూ, అతని ప్రక్కనున్న ఆ కుఱ్ఱవాడు ఎవరని ప్రశ్నించాడు. నవుకరు 'వాడు నా కొడుకే' నని అంటూ, అతను పద్దెనిమిదేళ్ళక్రిందట తనకు పెట్టెలో దొరకడమూ, తను పెంచడమూ అన్నీచెప్పాడు.

అది విన్న రాజు, "ఏమోయ్! నీ కొడుకు చాలా చురుకైనవాడుగా కనపడు తున్నాడు. కోటలో రాణిగారికి జరుగురుగా ఒక ఉత్తరం పంపించాలి. మీవాడి తెలివి తేటలు చూదాం. ఒక్కసారి పోయిరమ్మను"

డి. స్వరాజ్యలక్ష్మిదేవి, చీరాల



అని అనేసరికి, తన కొడుకును రాజుగారు ఇంతగా మెచ్చుకుంటున్నారుకదా అని నవుకరు పొంగిపోయి సరేనన్నాడు.

అదృష్టదీపుడు జాబు పుచ్చుకొని బయలుదేరి చీకటిపడేవేళకు ఒక అరణ్యం ప్రవేశించాడు. అల్లంత దూరాన మినుకు మినుకుమంటూ చిన్న వెలుగు కనిపించింది. అదృష్టదీపుడు మెల్లగా అక్కడకు పోయాడు. అది చిన్నకుటీరం. అక్కడ ఒక అవ్వ చలికాచుకుంటున్నది. ఈ కుర్రవానిని చూచి, ఆమె కుశల ప్రశ్నలు వేయగా, అతను తన వృత్తాంతమంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. అదంతా విని అవ్వ "అయ్యో!- దారితప్పి వచ్చి దొంగల చేతుల్లో చిక్కావే! వాళ్ళ కంట పడ్డావా నిన్ను ప్రాణాలతో పోనివ్వరు" అన్నది.

అందుకు కుర్రవాడు "అవ్వా! నాకేమీ భయంలేదు. నన్ను దేముడే రక్షిస్తాడు" అని నిబ్బరంగా అంటూ, అలసటగా ఉండటంచేత అక్కడనే నిద్రించాడు.

కొంచెం సేపటికల్లా దొంగల గుంపు వచ్చేసింది. 'ఈ కుర్రవాడు ఎవ?' డంటూ వాళ్ళు కాపలాకాసే అవ్వను గద్దించేసరికి, ఆమె అదృష్టదీపుని స్థితిగతులు వారి మనస్సు కరిగేటట్టు చెప్పింది. దొంగలు ఎంత దుష్టులైనప్పటికీ, ఈ కుర్రవాని ముఖం చూడగానే జాలిపడి, అతను పట్టుకువెళ్ళుతున్న ఆ జాబు ఏమైవుంటుంచా అని విప్పి చూచారు. "ఈ ఉత్తరం తెచ్చిన కుర్రవానిని చంపివేయవలెను" అని అందులో రాసివుంది!

దొంగల నాయకుడు ఆ జాబును చించివేసి "నేను వచ్చేలోగా ఈ ఉత్తరం తెచ్చిన పిల్లవానికి మన అమ్మాయినిచ్చి పెళ్ళి చేయవలెను" అని రాజు వ్రాసినట్టే మరిఒక జాబు వ్రాసి, దానిని అదృష్టదీపుని జేబులో ఉంచాడు.

తర్వాత అదృష్టదీపుడు నిద్రలేచి, బయలుదేరి రాజుగారి కోట చేరుకొన్నాడు. రాజకుమారికూడా ఇతనిని పెళ్ళాడటానికి ఇష్టపడింది. రాజు ఉత్తరంప్రకారం వెంటనే అదృష్టదీపునికి రాజకుమారినిచ్చి అతివైభవంగా వివాహం జరిపివేశారు.

కొన్నాళ్లకు రాజు ఇంటికి తిరిగివచ్చాడు. అదృష్టదీపుడు చంపబడటానికి బదులు, తన ఇంటి అల్లుడై కూర్చునందుకు చాలా విచారించాడు. అయినప్పటికీ, తన ఇష్టానికి వ్యతిరేకంగా ఇలా జరిగినందుకు, ఏ పాపమూ ఎరుగని అదృష్టదీపునిపైన రాజుకి కసి తీరలేదు. అందుచేత, ఏదో వంకతో వానిని తిప్పలుపెట్టి బాధించటానికే ఆయన నిశ్చయించుకున్నాడు.

ఒకరోజున రాజు అదృష్టదీపుణ్ణి పిలిచి, "అబ్బాయీ! నీవు నాకొక పని చేసిపెట్టాలి. ఈ పని నీవల్ల తప్ప ఇతరులవల్ల కాదని నాకు తెలుసు. ఇక్కడకు తిన్నగా తూర్పు దిశన ఒక అరణ్యంలో ఒక పాతాళగృహం కనిపిస్తుంది. అందులో ఒక రాక్షసుడున్నాడు. అతని తలలోవుండే బంగారు వెంట్రుకలలో మూడు వెంట్రుకలు తెచ్చిపెట్టాలి" అన్నాడు.




సహజసిద్ధంగా ధైర్య సాహసాలుగల అదృష్టదీపుడు 'ఓ, అలాగే పట్టుకువస్తాను. నాకిదొక పెద్దపనా?' అని బయల్దేరాడు.

అదృష్టదీపుడు ప్రయాణమై వెళ్ళగా వెళ్లగా మధ్యదారిలో ఒకపట్టణం తగిలింది. ఆ పట్టణపు నడిబజారులో ఒక బావిదగ్గర కాపలాకాస్తూవున్న ఒకతను, అదృష్టదీపుని చూచి, అబ్బాయీ, ఈ బావిలో ఎప్పుడూ సారాయి ఊరుతుండేది. ఇప్పు డెందుచేతనో ఇందులో నీరైనా ఊరడం లేదు, దీనికి కారణం నీకు తెలుసా?" అని అడిగాడు.

అందుకు బదులుగా అదృష్టదీపుడు "ఈపాటి సంగతి నాకు తెలియకపోవడ



మేమిటి ? నేనిప్పుడు చాలా అవసర కార్యం మీద వెళుతున్నాను. తిరుగా వచ్చేటప్పుడు నీ ప్రశ్నకు జవాబు చెప్పిపోతాలే" అని అంటూ, తన దారిని తాను సాగిపోయాడు.

మరికొంత దూరం వెళ్ళేసరికి, ఇంకొక పట్టణం తగిలింది. ఈ పట్టణంలో ఒకతను ఒక చెట్టుని కాపలా కాస్తున్నాడు. అతను అదృష్టదీపుని చూచి, అబ్బాయీ, ఈ చెట్టున ఎప్పుడూ బంగారుపండ్లు కాచేవి. ఇప్పుడు పండ్లులేవు సరికదా ఆకులుకూడా రాలిపోయినై. దీనికి కారణమేమిటి?" అని అడిగాడు. దీనికికూడా జవాబు మళ్లీ వచ్చేటప్పుడు చెబుతానన్నాడు అదృష్టదీపుడు.

ఇంకా పోగాపోగా, ఒక నది అడ్డం వచ్చింది. అక్కడి పల్లెవాడు అదృష్టదీపుని చూచి, "అబ్బాయీ !- నేను ఎల్లకాలము ఇక్కడ ఉండిపోవలసిందేనా ? నాకు విడుదలలేదా?" అని అడిగాడు. దీనికికూడా వచ్చేటప్పుడు జవాబు చెబుతానన్నాడు.

నది దాటి అవతలి ఒడ్డు చేరుకోగానే అదృష్టదీపునికి రాక్షసుని పాతాళగృహం కనిపించింది. అప్పుడు రాక్షసుడు ఇంట లేడు. కాని, ఇల్లు కాసే పెద్దమ్మమాత్రం ఉన్నది. అదృష్టదీపుడు తను వచ్చిన పని అంతా వివరించి చెప్పేసరికి, ఆమె,

"నాయనా !- నీవు తలపెట్టింది చాలా ప్రమాదకరమైన పని. అయినా, నీవు అదృష్టవంతునిలాగా కనపడుతున్నావు. కనుక, నా శాయశక్తులా నీకు సాయం చేస్తాను. ఎలాగనో యుక్తిచేసి రాక్షసుణ్ణి నిద్రబుచ్చుతాను. నిద్దట్లో నీకోసం అతని తలలోనించి బంగారు వెంట్రుకలు మూడూ లాగుతాను. అదేసమయంలో నీ మూడు ప్రశ్నలకూ వానిచేత జవాబులుచెప్పిస్తాను. అప్పుడు నీవు తలుపుచాటున నక్కి, అతను చెప్పే సమాధానాలు జాగ్రత్తతో వింటూ ఉండాలి" అని సలహాచెప్పింది.



ఇంతలో రాక్షసుడు వచ్చాడు. పెద్దమ్మ, వాడికి తిండిపెట్టి నిద్రబుచ్చింది.

కొంతసేపైనాక సమయంచూచి పెద్దమ్మ రాక్షసుని వెంట్రుక ఒకటి లాగింది. వాడు లేచి, 'ఏమిటది?' అని అరిచాడు. 'ఏమీ లేదు. కలలో నీజుట్టు పీకా'నంది పెద్దమ్మ. "ఏమిటి కలగన్నావు?" అని అడిగాడు రాక్షసుడు.

"ఫలానా పట్టణపు నడిబజారు బావిలో ఎప్పుడూ సారాయి ఊరేది ఇప్పుడెందుచేత ఎండిపోయింది?" అని అడిగింది పెద్దమ్మ.

"ఒశ్. ఇదేనా ఇంతాచేసి, నీకల! ఆ బావిలో రాతికింద ఒక గోదురుకప్ప నివాసం ఏర్పరచుకొన్నది. దానిని చంపినట్టయితే మామూలుగా సారాయి ఊరుతుంది" అని చెప్పి, రాక్షసుడు మళ్లీ నిద్రపోసాగాడు.

తరువాత పెద్దమ్మ రెండో వెంట్రుక లాగింది. రాక్షసుడు కోపంతో గర్జించేసరికి, "నాయనా!- కోపపడకు. కలగన్నాను. ఫలానాదేశంలో బంగారు పండ్లు కాసే చెట్టుకి ఇప్పుడు ఆకులు కూడా లేకుండా పోయినై, ఎందుచేత?" అని అడిగింది.

అందుకు వాడు "ఒక చుంచెలుక దాని వేళ్లను కొరికివేస్తున్నది. ఆ ఎలుకను చంపితే మామూలుగా చెట్టు కాస్తుంది." అనిచెప్పి, మళ్లీ గుర్రుపెట్టి నిద్రపోయాడు.

ఏమైనాసరేనని ధైర్యంచేసి, పెద్దమ్మ మూడవసారి మళ్లీ మరొక వెంట్రుక లాగింది. ఈసారి రాక్షసుడు గావుకేక పెట్టి, పెద్దమ్మను చావగొట్టడానికి సిద్ధమైనాడు.

"చెడ్డకలవస్తే ఏంచెయ్యమంటావు నాయనా!" అంటూ వాడిని శాంతపరచి, మళ్లీ తనకు కలవచ్చినట్టు "ఫలానా పట్టణంలో పల్లెవాడు ఎంతకాలంనించో పడవ నడుపుతున్నాడు వానికి విడుదల లేదా?" అని అడిగేసరికి, "విడుదల లేకేమి! నది దాటడానికి ఎవడు ముందువస్తాడో,

వాడిచేతికి తెడ్డుఇస్తేసరి రెండవవాడే పల్లెవా డవుతాడు" అని మళ్ళీ నిద్రపోయాడు.

అదృష్టదీపుడు, రాక్షసుడు చెప్పినమూడు సమాధానాలు జ్ఞాపకంపెట్టుకొని, పెద్దమ్మ ఇచ్చిన మూడు బంగారు వెంట్రుకలూ తీసుకొని, ఇంటిముఖం పట్టాడు.

మొదట అదృష్టదీపుడు నదివద్దకు వచ్చి పల్లెవాని సమాధానం చెప్పేసరికి, వాడు చాలా మెచ్చుకుని అతనిని నది దాటించి రెండు గోతాలనిండా బంగార మిచ్చాడు. తరువాత రెండో ఫారావాడు కూడా అతను చెప్పిన జవాబుకి ఎంతో సంతోషించి రెండు గోతాల బంగారం యిచ్చాడు. చివరకు మొదటి కాపలావాడి వద్దకువచ్చి సారాయి ఊరే ఉపాయం వెల్లడించగా, వాడు పొంగిపోయి రెండు గోతాల బంగారం ఇచ్చి పంపాడు.

అదృష్టదీపుడు కోట చేరుకొని, బంగారు వెంట్రుకలు మూడూ రాజుకి ఇచ్చాడు.

రాజు సంతోషించాడు, కాని దురాశ కలగటంచేత "ఇంత బంగారం ఎలా సంపాయించగలిగావు?" అని అడిగాడు.

దానికి అదృష్టదీపుడు "రాజా!-రాక్షసుని పాతాళగృహానికి పోయే దారిలో ఒక మహిమగల నది ఉన్నది. ఆ నది ఒడ్డునఉండే ఇసుక అంతా బంగారమే. ఆ నది దాటించే పల్లెవాడొకడు ఉన్నాడు. వాడి సహాయంతో నదిదాటి, మనం పట్టుకువెళ్ళిన గోతాలన్నీ ఇష్టంవచ్చినట్టు బంగారంతో నింపుకోవచ్చు" అని చెప్పాడు.

రాజు కష్టపడి ఆ నది ఒడ్డుకు చేరుకొని, నది దాటించమని పల్లెవానిని కోరాడు. అయితే, పల్లెవాడు ఒడ్డు దాటకముందే తెడ్డు రాజుచేతికి ఇచ్చి, తను గభీమని దూకి పారిపోయాడు. ఈ విధంగా తను చేసిన పాపాలకు ఫలితంగా రాజే పల్లెవా డయ్యాడు. అక్కడ అదృష్టదీపుడు రాజ కుమారితో హాయిగా ఉంటున్నాడు.





అనగా అనగా శాంతిపురమనే పట్నంలో జనులు ప్రతిరోజూ ఏదో ఒక ఇంటిలో ఎవరో ఒకరు హఠాత్తుగా మాయమైపోతుండే వారు. ఇందుకు కారణం ఏమిటా అని ఎంత ఆలోచించినా, ఎవరికీ అంతు చిక్కలేదు.

చివరకు ఒకరోజున, వీరన్న అనే అతను ధైర్యంగా ముందుకు వచ్చి, "మీ రేమీ భయపడకండి. మనవాళ్ళు మాయమైపోవటానికిగల రహస్యం కనిపెట్టి దీనికి విరుగుడు ఏమిటో తెలుసుకువస్తాను" అని చెప్పి ఒక గుఱ్ఱంమీద బయలుదేరాడు.

వీరన్న అలా పోగా పోగా, ఒకచోట బ్రహ్మాండమైన ఒక ఇసుకపర్వతమూ, దిగువనే ఒక కొలనూ, ఆ కొలనులో ఒక పడవా కనుపించినై.

చాలాదూరం తిరిగి అలిసివుండటాన, వీరన్న కొంచెం దాహం పుచ్చుకొని బడలిక తీర్చుకొందామన్ని కొలనువద్దకు వెళ్లేసరికి ఆ కొలను నిండా ముచ్చటైన తాబేళ్ళు కనిపించినై. వీరన్న ఆశ్చర్యపడి ఒక చిన్న తాబేలును చేతితోపట్టి తీయ బోయాడు. అదేం చిత్రమోగాని, అతను దానిని పైకి తీసేసరికి, ఆ తాబేలు ఒక పన్నెండేళ్ల పిల్లవానిగా మారిపోయింది.

ఆ పిల్లవాడు ఆశ్చర్యపోతూ, "అయ్యా, తమరెవరు? ఏవూరు? ఇక్కడికి ఎలా వచ్చారు?" అని భయపడుతూ అడిగాడు.

"మాది శాంతిపురం. అదిసరే..." అని వీరన్న ఆ కుఱ్ఱవానిని యింకా ఏమో అడుగబోతుండగా కొండపైనించి— "ఎవడురా వాడు? 'శాంతిపురం' అంటున్నాడు?" అని పెద్ద అరుపు వినిపించింది.

ఈ అరుపు వినగానే ఆ కుఱ్ఱవాడు— "అయ్యా ఇక ఒక్క క్షణంకూడా యిక్కడ వుండకూడదు. పారిపోదాం పదండి. దారిలో

వి. పార్థసారథి, గుంటూరు



అన్ని సంగతులూ చెబుతాను" అన్నాడు. వీరన్న సరేనని, ఆ కుర్రవానిని కూడా తన గుర్రం మీద ఎక్కించుకుని ఉడాయించాడు. దారిలో ఆ కుర్రవాడు యిలా చెప్పసాగాడు:

"ఆ రాక్షసుడి పేరు సికతాసురుడు. ఈ చుట్టుప్రక్కల గ్రామాలనుంచి మనుష్యుల్ని మాయం చేసి తెచ్చి, వాళ్ళని ఈ కొలనులో పడేస్తాడు. ఆ నీటి మహిమవల్ల దానిలో పడవేసిన మనుష్యులు తాబేళ్ళుగా మారిపోతారు. మరో చిత్రం ఏమంటే ఈ సికతాసురుడికి నిద్ర అంటే ప్రాణం. కుంభకర్ణుని తర్వాత వీడినే చెప్పాలి. ఒక నెలరోజులుపాటు ఈ చుట్టుప్రక్కల గ్రామాలమీద పడి మనుష్యుల్ని మాయం చేసి తెచ్చి కొలనులోవేస్తాడు. ఆ తర్వాత ఒక అరు నెలలపాటు హాయిగా నిద్రపోయి, చివరకి ఒక రోజు లేచి తాబేళ్ళని కొలనునించి తీస్తాడు. ఈలోగా వాళ్ళు మరింత బలిసివుంటారు. వాళ్ళనందర్నీ బొత్తులు బొత్తులుగా తినేస్తాడు. ఇప్పుడు మీరు ఏదో అదృష్టవశాత్తు నన్ను రక్షించారేగాని, మీ వూరిపేరు 'శాంతిపురం' అని మీరు చెప్పటం వాడు విన్నాడు కనుక, మిగతా వూళ్ళు వదలి మీ వూరిమీద పగబట్టి ఒక్క పురుగుకూడా లేకుండా నాశనం చేస్తాడు. కనుక వాడిపీడ ఎలాగైనా వదిలించుకోవాలి" అన్నాడు.

"సరే, ఆలోచిద్దాం. అంతకూ మీది ఏవూరో చెప్పావుకావేం?" అని వీరన్న అడిగేసరికి, శాంతిపురం పక్కనవుండే నరుగుపల్లె తన గ్రామం అని చెప్పాడు ఆ కుర్రవాడు. వీరన్న ఆ కుర్రవానిని నరుగుపల్లెలో అతని తలిదండ్రులకు వప్పగించి, తిరిగి తన వూరికి వచ్చి జరిగిన సంగతంతా వూరి ప్రజలకు చెప్పేసరికి వాళ్ళు మరింత హడలిపోసాగారు.




అక్కడ సికతాసురుడు మరికొద్ది రోజులకల్లా నిద్రలేచి, సందెడు ఇసుక మూట కట్టుకుని, "శాంతిపురం ఎక్కడ? శాంతిపురం ఎక్కడా?" అని గర్జించుకొంటూ బయలుదేరాడు. కొంతదూరం వచ్చేసరికి ఒక పెద్దమూట వీపున వేసుకొని వస్తున్న ఒక గొడారివాడు కనిపించాడు. అతనిని చూడగానే "శాంతిపురం ఎక్కడా?" అని ఉరిమాడు సికతాసురుడు.

శాంతిపురంనుంచే వస్తున్న ఆ గొడారివాడు "ఓహెూ, మన ఊరివాళ్ళందరూ హడలిపోతున్నది ఈ రాక్షసుణ్ణిగురించే అయివుంటుంది. దారి చెప్పానంటే పోయి పట్టణమంతా నేలమట్టం చేసివేస్తాడు. ఏమి చేయటమా!" అని ఒక్క క్షణం ఆలోచించి, తన వీపుమీద వుండే మూట గభీమని కింద పడవేసి, మరమ్మతుకోసం పోగుచేసి తెచ్చిన ఆ చింకి జోళ్ళన్నీ రాక్షసుని ఎదట గుట్టపోశాడు.

"ఓయి పెద్దమనిషీ!- నే నిప్పుడు శాంతిపురంనించే వస్తున్నాను. ఆ వూరు నించి బయలుదేరినదిమొదలు యిప్పటి వరకూ ఈ చెప్పులజతలన్నీ అరిగిపోయినై. దీన్నిబట్టి, ఎంతదూరం ఉంటుందో నీవే ఆలోచించుకో. అంతగా కావాలంటే, పని పూర్తిచేసుకొని తిరుగా వచ్చేటప్పుడు నేను తీసుకవెళ్ళి నిన్ను శాంతిపురంలో దిగబెడతాను" అన్నాడు. గొడారివాడు.

"సరే నే నిక్కడే వుంటాను. నీవుపోయి చప్పునరా" అన్నాడు రాక్షసుడు.

గొడారివాడు వెంటనే శాంతిపురం చేరుకొని, జరిగిన సంగతి అక్కడివాళ్ళకు చెప్పాడు. అదివిన్న వీరన్నకి ఒక చక్కటి ఆలోచన తట్టింది. వెంటనే వూరి ప్రజలని కొంతమందిని పలుగులతో, పారలతో వెంట దీసుకుని రాక్షసుడి కంట పడకుండా ఒక అడ్డదోవన వెళ్ళి ఒకచోట పెద్ద కందకం

తవ్వించాడు. దానిపైన చెట్లకొమ్మలూ అవీ పేర్చి, పైన ఆకులుకప్పి, అక్కడ కందకం వున్నట్టు తెలియకుండా వుండేలా చేశాడు. ఆ తర్వాత వీరన్న గొడారివానిచెవిలో ఏదో రహస్యం చెప్పి పంపేశాడు. తనూ, గ్రామ ప్రజలూ ఒకచోట దాక్కొని వున్నారు.

మరికొంతసేపటికి గొడారివాడు రాక్షసుడిని కలుసుకొని 'ఇక బయలుదేరు శాంతిపురం పోదాం' అన్నాడు. సరేనని ముందు గొడారివాడూ, అతని వెనకనే రాక్షసుడూ నడుస్తున్నారు. గొడారివాడితోపాటు వేగంగా నడవలేక రాక్షసుడు కొంత వెనకపడ్డాడు.

గొడారివాడు త్వరత్వరగా పోయి కందకానికి అవతలి ప్రక్కన నిలబడి "ఏమయ్యోవ్! ఇలాగైతే మనం పదేళ్లు నడిచినా శాంతిపురం చేరుకోలేం. కాస్త త్వరగా అడుగు వెయ్యి" అని కేకవేశాడు.

ఈ కేకవిన్న రాక్షసుడు ఆత్రంకొద్దీ పరుగెత్తుకుంటూవచ్చి అక్కడ కందకం వున్న సంగతి తెలియక, ఆ ఆకులమీద కాలు వెయ్యటంతోటే ఒక్కసారిగా అడుగుకంటా పోయాడు. వెంటనే ఆ చుట్టు ప్రక్కల దాగివున్న వీరన్న గ్రామప్రజలతో సహా వచ్చి ఆ కందకం పూడ్చివేశాడు. అంతటితో రాక్షసుడి పీడ వదిలించుకుని తర్వాత వాళ్లు కొలనువద్దకు వచ్చారు. దానిలోవున్న తాబేళ్ళనన్నిటినీ బైటికి తీసే సరికి వాళ్ళంతా తిరిగి మనుష్యులుగా మారారు. వాళ్ళనికూడా వెంటబెట్టుకుని వీరన్న శాంతిపురం తిరిగి వచ్చాడు.

ఇంత యుక్తిచేసి ఆ గ్రామాన్ని శక్తివంతుడైన రాక్షసుడి బారినుండి రక్షించిన వీరన్ననీ, అతనికి సాయపడిన గొడారి మల్లన్ననీ గ్రామప్రజలు ఎంతగానో మెచ్చుకొని వాళ్ల యిద్దరిపేర్లు చిరస్థాయిగా వుండేట్టు 'శాంతిపురం' అని పిలువబడే ఆ వూరుపేరు ఆ నాటినించీ 'వీరమల్లాపురం' అని మార్చారు.



# కుక్క ముక్కు చల్లగా వుంటుంది



## ఎందుకో తెలుసా?

CHITRA

చాలాకాలం క్రిందట ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. అతను పరమ లోభి కఠినాత్ముడున్నూ. అతని పిల్లలు ఒక కుక్కను తెచ్చి ముద్దుగా పెంచుతూ వచ్చారు. ఈ పని రైతుకు ఎంతమాత్రం ఇష్టం లేకపోయింది. కాని జాలిగుండె గల అతని భార్య మటుకు విశ్వాసంగల ఆ కుక్కను ప్రాణప్రదంగా చూచుకునేది.

ఒకప్పుడు ఆ వూరిలో భయంకరమైన అంటువ్యాధి ప్రవేశించింది. అది త్వరలోనే గ్రామమంతా వ్యాపించి, అనేకమంది చనిపోజొచ్చారు. గ్రామస్థులు ఈ పరిస్థితి చూచి హడలిపోయి, మరొక వూరు చేరుకొని ప్రాణాలు నిలబెట్టుకోవటమే గత్యంతర మని నిశ్చయించారు.

ఆ వూరినించి కదిలిపోవాలెనంటే, రెండు మూడు రోజులు పడవ ప్రయాణం చేయాలి. గ్రామస్థులతోపాటు పడవలో రైతు కుటుంబంకూడా బయలుదేరారు. అతని పిల్లలూ, భార్యా తమకు ప్రాణ సమానమైన కుక్కనుకూడా పడవ ఎక్కించబోయారు.

"జనానికే చోటు చాలక ఇబ్బంది పడుతూవుంటే కుక్కకూడా ఎందుకు? దాన్ని వదిలేయండి?" అంటూ రైతు విసుక్కొన్నాడు. కాని, అతని భార్య "ఐతే దానినే కాదు, నన్నూ వదిలేయండి" అని విరక్తిగా అనేసరికి, తప్పదురా భగవంతుడా అనుకుని, సమ్మతించాడు రైతు.

రాత్రికాగానే ప్రయాణికులందరూ సర్దుకొని పడుకున్నారు. కుక్కమాత్రం సహజసిద్ధమైన విశ్వాసగుణంతో. పడవను నలుమూలలా పరీక్షిస్తూ కావలా కాస్తూనేవుంది.

అది అలా కావలా కాస్తూవుండగా, ఒకచోట పడవలోకి నీళ్ళు వస్తున్నట్టు కనిపించింది. ఈ నీళ్లు ఎందుకు వస్తున్నాయా

'కథలతాతయ్య'

అని కుక్కకు కంగారుపుట్టి, పడవంతా కలియతిరిగిచూడగా ఒకచోట ఒక చిన్న రంధ్రంలోనుంచి పడవలోకి నీళ్లు రావటం కనిపెంచింది.

"జనమంతా పాపం నిశ్చింతగా నిద్రిస్తున్నారు. ఈ రంధ్రంలోనించి నీరు వస్తున్న సంగతి ఒక్కరికీ తెలియకపోయె. ఇలానే ఊరుకున్నట్టయితే, మరొక్క గంట సేపటిలో నీరు జోరుగా ప్రవహించి పడవ గంగార్పణమైపోవటానికి సందేహం లేదు. ఏమి చేసేది? ఇన్ని ప్రాణాలు ఎలా నిలుస్తాయి?" అంటూ, కుక్క అనేకవిధాల మథనపడగా దానికి మెరపులాగా ఒక చక్కటి ఆలోచన తట్టింది. తక్షణమే అది, తన గతి ఏమవుతుందో అనే తలంపే లేకుండా, దాని ముక్కును ఆ చిన్న రంధ్రంలో పెట్టి, లోనికి నీరు రాకుండా అడ్డుకొన్నది. అది ముక్కు ఇవతలకు తీసిందంటే బిలబిలమంటూ నీరు వచ్చి పడి, పడవకు ప్రమాదం కలుగుతుందన్న మాట. ఈ సంగతి ఎరిగిన ఆ కుక్క ప్రయాణికులను కాపాడటంకోసం ముక్కు రంధ్రంలోనేవుంచి, రాత్రల్లా నిలబడేవుంది.

తెల్లవారగానే పడవపెద్ద వచ్చి కుక్క కదలకపోవటానికి గల కారణం గ్రహించి, దాని తెలివితేటలకూ, విశ్వాసానికీ ఆశ్చర్య పోయాడు. పడవలోనివారందరూ తమను రక్షించిన ఆ కుక్కను ఎంతో మెచ్చుకున్నారు. దాని యజమానిఐన రైతుకూడా తనఉపేక్షకుసిగ్గుపడి పశ్చాత్తాపంచెందాడు.

మరికొద్దిరోజులకే ఆ గ్రామంలో పరిస్థితులు చక్కబడగా, రైతు కుటుంబం తిరిగి వచ్చారు. అప్పటినించీ ఆ రైతు తక్కిన కుటుంబంతోపాటు కుక్కనుకూడా ఎంతో ప్రేమతో చూచుకోసాగాడు.

ఒక రాత్రల్లా నీటిలో తడిసి ఉండటం చేత, ఆనాటినించీ కుక్కముక్కు చల్లగా ఉంటున్నదని చెప్పుకొంటారు.



## చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

### అడ్డము :

3. బిడ్డలస్నానం
4. దప్పి
5. ఒక సంవత్సరం
7. అయిష్టం
10. ఇవి తొమ్మిది
12. చెదరిన నిమునం
14. తలగుడ్డ
15. ఆహారము
16. యముడు
17. ముఖమునకుఅడ్డు
18. నీతులు




### నిలువు :

1. విషము
2. తోక
4. రక్కసి
6. సంతోషంగా
8. గాడిదపాలు
9. చేయి
11. ఋషి
13. చెట్టుకు వుండేది
15. గొంతు
16. ఆభరణం
17. చందమామ అందరకూ....

## పన్నీరుబుడ్డి ముగ్గు



ఈ ముగ్గు వేసినది :
హెచ్, శాంత, మంగళూరు

---

51-వ పేజీలోని
వినోద చదరం జవాబు :

1. మధుకరము.
2. వికటకవి.
3. కనుమనక.
4. రాకపోకలు.
5. పాలకడలి.



# పిల్లల పెంపకం

## నిజం చెప్పటం

పసిపాపల మనస్సు నిర్మలంగా వుంటుంది కనుక, వాళ్ళ బుద్ధి సామాన్యంగా తప్పు దోవకు పోదు. అందుచేతనే వాళ్ళు ఎప్పుడూ నిజమే చెబుతారు. ఒకవేళ పసిబిడ్డ అబద్ధం ఆడటమే తటస్థింటే, అందుకు కారణం (1) అది వాళ్ళ ఊహకు అందని విషయం అయివుండాలి. (2) నిజం చెబితే ఎదటివారి మనస్సు కష్టపడుతుందేమోనని తోచినట్టయితేకూడా అబద్ధమాడవచ్చు. లేదా (3) తాము శిక్షింపబడతామనే భయం కలిగినప్పుడుకూడా నిజం కప్పిపుచ్చటం కద్దు.

పరిహాసానికైనాసరే, బిడ్డయెదట ఎన్నడూ అబద్ధం చెప్పకూడదు. మామూలు నిత్యకృత్యాలలో పిల్లలతో తల్లి అబద్ధం చెప్పదు. కాని, అది చాలదు. పిల్లలకు చెప్పే కథలలోనూ కబుర్లలోనూ వీలైనంతవరకు యదార్థవిషయాలే అందించాలి. మనకే సంశయాస్పదంగా ఉన్న విషయాలు పిల్లలకు చెప్పనేరాదు. వాళ్లు ఎదురుప్రశ్న వేశారంటే, మనం తెల్లముఖం వేసి, జవాబుచెప్పటానికి తడబడవలసివస్తుంది.

బిడ్డలు ప్రతివిషయంగురించీ ఎన్నెన్నో విడ్డూరమైన ప్రశ్నలు వేస్తూఉండటం సహజం. వాటికి సూటిగా నిజమైన జవాబులే చెప్పాలి. ఒకవేళ పిల్లలకు చెప్పటానికి అభ్యంతరమైన విషయమైతే, "పాపా! దీనికి సమాధానం నీ కిప్పుడు అర్థంకాదు. పెద్దయాక నేర్చుకుందుగానిలే!" అని మనసుకి నచ్చేటట్టు చెప్పాలి.

పిల్లలు వేసే కొన్ని ప్రశ్నలకి పెద్దవాళ్లు జవాబు చెప్పలేరు. ఐనా శ్రమ తీసుకుని జవాబు తెలుసుకుని పిల్లవాని మనసుకు నచ్చేటట్టు చెప్పాలిగాని, మొక్కుతీర్చుకొన్నట్టు ఏవో అబద్ధాలు కల్పించి చెప్పేసి, బిడ్డను తృప్తిపరచకూడదు. తరుచు పెద్దవాళ్లు సరియైన సమాధానాలు చెప్పలేక, కుర్రవాళ్ళను కసురుతారు. అది ఎంతమాత్రం కూడదు.

ఒక పిల్లవాడు అబద్ధమాడినట్టయితే, ఉపేక్షచేయక, ఎలాటి పరిస్థితులలో వాడు అలా చేయవలసివచ్చిందో కనుక్కొని, మరెప్పుడూ అబద్ధం ఆడకుండా చూడాలి.

మీ పెద్దమ్మ



ఈ బొమ్మ ఏమిటో చూచారా? ఒక కుర్రవాడు బడిలో తన పలకమీద ఒక చక్కటి బొమ్మ వేశాడు. ఆ బొమ్మని తన తలిదండ్రులకు చూపాలనే ఆత్రంతో ఆ కుర్రవాడు పరుగున ఇంటికి బయలుదేరాడు. కాని, పాపం ఆ కుర్రవాడు త్రోవలో జారిపడ్డాడు. పలక ముక్క ముక్కలైపోయింది. పగిలిన పలక ముక్కలన్నీ ఎలా కలిపితే తను వేసిన బొమ్మని తలిదండ్రులకు చూపగలడో ఆ కుర్రవానికి తెలియలేదు. పాపం, మీరు ఆ కుర్రవానికి సాయపడి పలకముక్కల్ని కలపండి చూదాం. మీకు చేతగాకపోతే జవాబుకి 55-వ పేజీ చూడండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | | | క | | |
| 2. | | క | | క | |
| 3. | క | | | | క |
| 4. | | క | | క | |
| 5. | | | క | | |

## వినోద చదరం

ఈ క్రింది ఆధారములతో ప్రక్కనున్న చదరం పూర్తి చెయ్యండి. పూర్తి చెయ్యలేకపోతే జవాబు 49-వ పేజీలో చూడండి.

1. తుమ్మెద
2. తెనాలి రామలింగడు
3. స్పష్టంగా కనుపించని
4. రావటం పోవటం
5. క్షీర సముద్రము

# ఇంద్రజాలము

## పేకముక్క మీద నీళ్ళలోటా

చూచేవారికి ఈ గారడీ అమితాశ్చర్యం కలిగిస్తుంది. చేయటానికి మాత్రం ఇంత సులువైన ట్రిక్కు మరొకటి లేనేలేదు. మేజామీద ఒక పేకముక్క నిలబడి వుండటం, దానిమీద నీటితోవున్న ఒక లోటా నిలబెట్టబడి ఉండటం కనబడుతూ వుంది కదా! ఇది ఎలా సాధ్యమైందని మీ వూహ? ఇదీ దీని రహస్యం—

ఇస్పేటు ఐదు ముక్క ఒకటి తీసుకో. అదే పేకలోని మరొక ముక్క ఏదైనాసరే తీసుకో. ఈ ముక్కను నిలువుగా సగానికి మడిచి, వెనుకభాగం పైకి కనబడేటట్టు ఆ సగం భాగం ఇస్పేటుఐదు ముక్క వెనుకభాగానికి అంటించు.



పేకముక్కలు ఒకదానికొకటి ఎలా అంటించవలసిందీ, ఈ ప్రక్క పేజీలో వున్న 2-వ బొమ్మలో చూపబడింది.

ఈ పటంలో కనిపిస్తున్న 'కగ' అనే గీత ఇస్పేటుఐదుకి పైఅంచు. 'చ' అనేది వెనుక అంటించిన రెండవ ముక్క సగభాగం. రెండవముక్కయొక్క తక్కిన సగభాగం బందులుగల తలుపులాగ అటూ ఇటూ ఆడుతూ వుంటుంది. ప్రేక్షకులకు చూపేటప్పుడు ఒకవేపు ఇస్పేటు ఐదు ముక్కగాను, రెండవవేపు వెనుకభాగంగాను మామూలుగానే కనబడుతుంది. ఈ పేకముక్కను ప్రేక్షకులకు చూపినతరవాత

జాగ్రత్తగా వ్రేళ్ళమధ్య పట్టుకుని వ్రేళ్ల కదలికవల్లనే 'చ' భాగం మధ్యకు వచ్చేలాగ ఈ ప్రక్క బొమ్మలో చూపి నట్లు చేస్తే పేకముక్క కింద పడిపోకుండా మేజామీద నిలబడి వుంటుంది. పేక ముక్క నిలబడివుండడం చూడగానే ప్రేక్షకులు ఆశ్చర్యపోతారు.

అప్పుడు నీటితో నిండిన గాజుగ్లాసును నిలబడిన ఈ పేకముక్క పైన పెట్టితే లోటా కూడా పడిపోకుండా నిలిచి వుంటుంది. ఇది చూసి ప్రేక్షకులు ఇంకా ఆశ్చర్యపోతారు.

(2) చ

క గ

నిజానికి గాజులోటా పటంలో చూపినమాదిరి 'క, గ, చ' అనే అంచులపైన నిలబడి వున్నదన్నమాట.

మేజామీద పేకముక్క, దానిపైన నీళ్ల లోటా నిలబడటం ప్రేక్షకులు చూచి ఆనందించినవెంటనే లోటాను తీసేయాలి. ఒకవేళ గట్టిగా గాలి వీచినట్టయితే అది క్రిందపడి రహస్యం వెల్లడి అయిపోవచ్చు. ఈ ట్రిక్కు ముగించడానికి ముందు మళ్లీ ఒకసారి ప్రేక్షకులకు ఏమీ అనుమానం కలగకుండా కార్డు ముందుభాగం వెనుక భాగం మొదట చూపినమాదిరిగానే మరొకసారి చూపించాలి.



[అనక్తిగల పాఠకులు, ఈ గారడీనిగురించి ఉచితంగా సలహా పొందదలిస్తే, వారు 'చందమామ' పత్రికపేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. మీరు వారికి ఉత్తరాలు ఇంగ్లీషు లోనే వ్రాయాలి. వారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మేజిషియన్,
పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.]

# ఈ లెక్క నేర్చుకో

నీ స్నేహితుని ఒక చదరం గీసుకోమని చెప్పు. చదరం మధ్యని ఐమూలలుగా రెండు గీతలు గీసుకోమను. తర్వాత చదరం నాలుగుమూలలా అతని యిష్టం వచ్చిన అంకెలు వేసుకోమను. అలాగే ఐమూలగా గీసిన గీతలు రెండూ కలిసిన చోటకూడా అతని ఇష్టంవచ్చిన అంకె వేసుకోమను. అతను తను గీసినచదరం, వేసినఅంకెలూ నీకు చూపనక్కర్లేదు. ఇలా చదరంగీసి అంకెలు వేసుకున్న తర్వాత నువ్వు అతనిని, మొదట చదరానికి నాలుగుమూలలా వేసిన నాలుగు అంకెలూ కలిపి మొత్తం చెప్పమను. తర్వాత, ఒక ఐమూలగావున్న మూడు అంకెల మొత్తం చెప్పమను. ఆ తర్వాత రెండో ఐమూలగావున్న మూడు అంకెల మొత్తం చెప్పమను. అతనలా చెప్పినప్పుడు, అతను చదరం మధ్య వేసిన అంకె ఎంతో వెంటనే చెప్పగలవు. దీనికి ఒక చిన్న కిటుకువున్నది. అదే యిప్పుడు చెపుతాను నేర్చుకో. నీ స్నేహితుడు ఈ ప్రక్కన వున్న చదరం మాదిరిగా గీసి అంకెలు వేశాడనుకో.




మొదట చదరంచుట్టూవున్న నాలుగు అంకెల మొత్తం 68 అని చెబుతాడు. తర్వాత ఒక ఐమూలగావున్న మూడు అంకెల మొత్తం 56 అని చెబుతాడు. తర్వాత ఇంకో ఐమూలగావున్న మూడు అంకెల మొత్తం 46 అని చెబుతాడు.

ఈ మూడు అంకెలూ నీకు చెప్పగానే నీవు అతను చదరంమధ్య వేసుకున్న అంకె చెప్పవచ్చు. ఎలాగంటే—

ఐమూలగాచెప్పిన రెండు సంఖ్యలూ, అంటే 56, 46 కలుపు. అప్పుడు 102 వస్తుంది. ఈ 102 లోంచి మొదటచదరం నాలుగుమూలలా కూడి చెప్పిన అంకె, అంటే 68, తీసివెయ్యి. 102 లోంచి 68 తీసివేస్తే 34 కదూ వస్తుంది?

నీ స్నేహితుడు చదరం మధ్య వేసుకున్న అంకె దీనిలో సరీగా సగం వుంటుంది. అంటే 17 అన్నమాట.

ఇలాగే నీ స్నేహితుడు అతని యిష్టంవచ్చిన అంకెలు ఏమి వేసుకున్నాసరే, అతను చెప్పిన మూడు సంఖ్యల్నిబట్టి మధ్య వేసిన అంకె వెంటనే చెప్పవచ్చు.

# చందమామ
## సామెత కథల పోటీ



ఈ సంచికలో వేసిన "గుఱ్ఱం గుడెక్కింది" అనే సామెత కథ ఈ నెల బహుమతి పొందింది. దీనిని వ్రాసినది, ధూళిపాళ శేషమ్మ కాకినాడ. బహుమతిగా, ఈమెకు జూలై 50 నుంచి ఒక సంవత్సరం వరకు 'చందమామ' ఉచితంగా పంపబడుతుంది.

# చందమామ
## సీరియల్ కథ



ఎన్నో చిత్ర విచిత్రమైన విషయాలతో అద్భుతంగా చిత్రించబడిన మరొక పెద్ద కథ జులై '50 నుండి 'చందమామ'లో ప్రారంభించబోతున్నాము. ఇంతకు ముందు మీరు చందమామలో చదివిన పెద్ద కథలన్నింటికంటె ఈ కథ మరింత ఆకర్షవంతంగా వుంటుంది. మీ కాపీకొరకు యిప్పుడే జాగ్రత్తపడండి.

పగిలిపోయిన పలకకి జవాబు.



పజిలుకు జవాబు






ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (జూలై) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI

Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras-1



Chandamama, June '50

Photo by N. Ramakrishna

ఉన్ని ముసుగు

